## నీతి మంజరి

శ్లో॥ పుస్తకం వనితా విత్తం
పరహస్తం గతంగతః
అథవా పునరాయాతం
జీర్ణం భ్రష్టా చ ఖండశః

ప. పొత్తమును పొలతియు విత్తమ్ముఁ బరులకు
నిచ్చినంత తిరిగి వచ్చుటరుదు
వచ్చెనేని, చిరిగి, భ్రష్టయై, కొంచమై
వచ్చుగాని రావ యిచ్చినట్లు.

శ్లో॥ ఉత్తమే క్షణకోపస్స్యాత్
మధ్యమే ఘటికాద్వయమ్
అధమేస్యాదహో రాత్రం
పాపిష్ఠే మరణాంతకమ్.

ప. ఉత్తమునకొక్క క్షణకాల మ్ముగ్ర కోప
ముండు; మధ్యమునకు రెండు ఘడియ
లధమ జనునకొక్క యహము రాత్రియునుండు
పాపమతికి చచ్చువరకు పోదు.

శ్లో॥ రాజవత్పంచ వర్షాణి
దశ వర్షాణి దాసవత్
ప్రాప్తేతు షోడశే వర్షే
పుత్రం మిత్రవదాచరేత్.

ప. అయిదు వత్సరమ్ములవనీదవునివోలె
పదియు వత్సరములు బంటువోలె
పిదప నంతనుండి ప్రియమిత్రుఁబోలెఁ దా
జూడవలయుఁ దండ్రి సుతులనెల్ల.

— పృధివి సుబ్బనాగయ్యకవి

## స్వీకారం

" తెలుగు నాటకం " వెల : 15-00

" భాషావ్యాసాలు " (వ్యాససంపుటి) వెల : 12/-

"తీరని భయం" (కథల సంపుటి) వెల : రు. 6/-

పై గ్రంథముల రచయిత : డా॥ ఎస్. గంగప్ప
ఎం. ఏ , పిహెచ్. డి.,
ప్రతులకు : శ్రీమతి ఎస్. పార్వతమ్మ
శశి ప్రచురణలు, C/73 శ్రీనివాసనగర్ కాలని
గుంటూరు - 522006

" ఈతరం స్వరచిత్రం " వెల : 10-00
రచన : డా॥ మాదిరాజు రంగారావు
ప్రతులకు : రసధుని ప్రచురణలు
క్వార్టర్ నెం - 14 కాకతీయ విశ్వవిద్యాలయం
విద్యారణ్యపురి, వరంగల్ - 1

" ప్రవంతి (కవితా సంకలనం) " వెల : 5-00
రచన : సిసింద్రీ
ప్రతులకు : వై. అగస్టీన్
బి/2004 కెనాల్స్, హిల్ కాలని - 508202
నాగార్జునసాగర్

" కిన్నెర (పాటలు) వెల : 10-00
రచన : డి. సుజాతాదేవి
ప్రతులకు : శ్రీమతి డి. సుజాతాదేవి
' కమలానికుంజ్ ' అశోక్ నగర్
విజయవాడ - 520 010

" భారతీ కళాతరంగిణి వెల : 14-00
రచన : మంగళగిరి ప్రమీలాదేవి
ప్రతులకు : శ్రీగిరి ప్రచురణలు
రైలుపేట : రేపల్లె గుంటూరు జిల్లా
లేక మంగళగిరి ప్రమీలాదేవి, లెక్చెరర్
హిందూకాలేజి, మచిలీపట్నం



అక్టోబరు - 1986

సంపుటి : 2

సంచిక : 10


# శ్రీవాణి


సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818



చందా వివరాలు

విడిప్రతి : రు. 3-00

సంవత్సర చందా : రు. 33-00

2 సం॥ల చందా : రు. 60-00

4 సం॥ల చందా : రు. 116-00

జీవిత సభ్యత్వం : రు. 500-00

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SPANDANA PRINTERS MACHILIPATNAM


## విషయ సూచిక



ముఖచిత్రం :

సర్దార్ వల్లభాయ్ పటేల్

శ్లో॥ స కిం సఖా సాధు నశాస్తి యోఽధిపం
హితాన్న యస్సంశృణుతే స కిం ప్రభుః
సదానుకూలేషు హి కుర్వతే రతిం
నృపేష్వమాత్యేషుచ సర్వసంపదః ॥

ప్రభుత్వం చక్కగా సాగిపోవటానికి ముఖ్యంగా ముగ్గురు కారణం. అందులో కూడా ప్రజలది ప్రథమ స్థానం, రెండవది మంత్రుల ఆలోచన, మూడవది పరిపాలకుడైన రాజుయొక్క దక్షత. ఈ మూడు శక్తులకు అనుకూల వాతావరణం ఏర్పడితే ఆ దేశంలోని ప్రభుత్వం సమంగా నడిచిపోతున్నదని భావించవచ్చు. ఇదే సరియైన ఐకమత్యమంటే. ఇది ఒకనాటి మాట.

# అమృతవాణి

కూచిభొట్ల చంద్రశేఖరశర్మ

ఇప్పుడు ప్రజాస్వామ్యయుగం. అన్ని దేశాల్లోని ప్రజల్లో చైతన్యం తేజరిల్లుతున్నది. పూర్వంలాగా రాజు పరిపాలనలో అస్వతంత్రంగా ప్రజలు బ్రతకటానికిష్టపడరు. ఆ రాజులు లేరు. వారి స్థానంలో ప్రజలు ఎన్నుకొని నిలబెట్టిన ప్రతినిధులే ప్రజాసేవ పేరుతో పరిపాలిస్తారు.

అయితే పై శ్లోకంలోని హితం అందరికీ అన్ని కాలాల్లోను కావలసిందే. పూర్వం మంత్రులు రాజుకు చక్కని ఆలోచన అందించేవారు. అలాంటి హితం చెప్పగలిగినప్పుడే అతడు నిజమైన మంత్రి. స్నేహితుడైనా అంతే అనుకోండి. మంత్రి అయినవాడు ప్రజాదృష్టితో మంచిని చక్కగా రాజుకు చెప్పకపోతే అది మంత్రితప్పు. అలాంటి మంత్రి దుష్టమంత్రి అన్నమాట.

అలాగే మంత్రి హితాన్ని చెప్పినప్పుడు నిర్లక్ష్యంగా భావించే రాజు కూడా అంతే. రాజ్యపరిపాలనకు కావలసింది మంత్రుల మంత్రాలోచన. అంత ముఖ్యమైన మంత్రిగారి ఆలోచనను సలహాను స్వీకరించని రాజును ఏమనాలి? వట్టి దుష్టప్రభువనాలి. ఆప్తులు చెప్పే హితాన్ని విననివాడు కూడా అంతేనన్నమాట.

ఇప్పుడు రాచరికం లేకపోయినా యీ సూక్తి నిత్యసత్యమైనది. నిర్లక్ష్యం చేయదగనిది. ప్రజలను, వారి అభివృద్ధిని పురస్కరించుకొని చేసే ప్రతి హితాన్ని ప్రభుత్వం అవశ్యం స్వీకరించాలి. ప్రజలంటే అన్ని వర్గాలవారు వస్తారు. వ్యవసాయదారులుంటారు, ఉద్యోగులుంటారు, ధనికులుంటారు, దరిద్రులుంటారు, శ్రమికులుంటారు, సాధువులుంటారు, వీరంతా ప్రజలే. ఎవరికీ అపకారం జరగని రీతిలో సమతాభావాన్ని ప్రభుత్వం చూపించాలి. హితులైనవారు సన్నిహితులయి సమసమాజ దృష్టిలో మంచిని అందరికీ కావలసిన 'మేలును' ప్రబోధిస్తున్నప్పుడు పెడచెవినిబెట్టే ప్రభుత్వంకూడా యిలాంటిదే అవుతుంది.

ప్రజలు ప్రజాప్రతినిధులు మంత్రులు పరస్పర సద్భావంతో సర్వజన హితైక దృష్టితో అనుకూలంగా ఆలోచనలు సాగిస్తే ఆ దేశం సుభిక్షంగా వుంటుంది. సర్వసంపదలు ఆ దేశంలో నెలకొని వుంటాయి.

అంతేగాని ప్రజలను పీడించే విధంగా, కక్షకట్టి యేదో విధంగా ఒక తెగవారిని, తనకు సరిపడనివారిని వేధించటం యే ప్రభుత్వమన్నా చేస్తే అది దుష్ట ప్రభుత్వమే అవుతుంది. దేశం దుర్భిక్షమై దిగజారిపోతుంది. ★

# సంపాదకీయం హిందూ దేవాలయాలు - ధార్మికమండలి

మన రాష్ట్రంలో సుమారు 32 వేల హిందూ దేవాలయాలున్నాయి. మఠాలు, మత ధర్మసంస్థలు మూడు వేలదాకా వుంటాయి. వీటి క్రింద 282 కోట్ల రూపాయల విలువచేసే 3,11,150 ఎకరాల భూములున్నాయి. ఇవికాక భవనాలు, ఖాళీ స్థలములు యింకా ఎన్నో వున్నాయి. వీటిమీద సక్రమంగా ఆదాయం పొందగలుగితే ఆలయాల పూజారులకుగాని, నిత్య ధూపదీప నైవేద్యాలకుగాని ఎటువంటి లోటు వుండదు. మరమత్తులకు నిధుల కొరత వుండదు. ఎటువంటి లోటు రాకూడదనే పరమావధితోనే దేవాలయాలను నిర్మించిన దాతలే శాశ్వతమైన స్థిరాస్థులను యిచ్చిపోయారు. అలనాడు ధార్మిక బుద్ధితో దానాలు చేసారు దాతలు. అయితే ఈనాడు దేవుడి సొమ్మును కైంకర్యం చేయడానికి ఏమాత్రం వెరువని పెద్దమనుష్యులు బయలుదేరారు. ఇటువంటి పెద్దలకు 1966 సం॥ కౌలుదారీ చట్టము శ్రీరామరక్షగా రూపొందింది. నామమాత్రపు కౌలు నిర్ణయించినా బకాయి పెడుతూ భూమిని మాత్రం వదలకుండా, ఈ చట్టమును అడ్డం పెట్టుకొని దేవునికి అన్యాయంచేసి మూటలు కట్టుకుంటున్నారు. దాతలు యిచ్చిన సొమ్ము దూతలపాలై అనేక దేవాలయాలు జీర్ణావస్థలో వున్నాయి. దేవాలయాల దీన పరిస్థితిని సమీక్షించి తగు సూచనలు చేయమని మనరాష్ట్ర ప్రభుత్వం చల్లా కొండయ్య కమీషన్‌ను నియమించింది. ఈ కమీషన్ 1300 పేజీల రిపోర్టును తయారుచేసి ప్రభుత్వానికందించింది. "కమీషన్ నివేదికలో అమృతం, హాలాహలం రెండూ వున్నాయి. ఇందులో న్యాయంకన్నా అన్యాయమే ఎక్కువగా వుంచి" అని ప్రముఖ పాత్రికేయులు శ్రీ నీలంరాజు వెంకటశేషయ్య పేర్కొన్నారు. "అన్ని మతాలను వదిలి ఒక్క హిందూమత వ్యవహారాలపై కమీషన్ ఎందుకు వేయవలసివచ్చింది" అని రాష్ట్ర ఆగమార్చక పండి కాంగ్రెసు 14వ వార్షికోత్సవంలో ప్రముఖులు సందేహాన్ని వెలిబుచ్చారు. కౌలుదారీ చట్టం నుంచి ఆలయ భూముల్ని మినహాయించాలన్న కమీషన్ సిఫార్సులను నామమాత్రం కౌలుకు వ్రాయించుకొని అనుభవిస్తున్న పరాన్నభుక్తులు కొందరు ఆగ్రహాన్ని వెలిబుచ్చారు. "తమ వంశ పారంపర్య హక్కులను పరిరక్షించుకొనే నిమిత్తం అర్చకులు శాంతియుత ఆందోళనకు సిద్ధంకావాలి" అని శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జియ్యర్‌స్వామి పిలుపుయిచ్చారు. అంతేకాదు దేవాలయాలు వేదజనితాలవి, వేదాలపై సాధికారం కలిగి, వేదములలోని గూఢార్థాలను ఆకళింపుచేసుకున్నవారు మాత్రమే దేవాలయపాలనా వ్యవహారాలలో జోక్యంచేసుకోవడానికి అర్హులని స్పష్టంచేసారు. దేవాలయాల స్థిరాస్థులను అమ్మి ఆ డబ్బును ప్రభుత్వ ఖజానాలో జమచేయించాలని ప్రభుత్వం భావిస్తున్నది. అదేభావంతో తిరుపతి దేవస్థానం డబ్బును కొంత ప్రభుత్వ ట్రెజరీలో డిపాజిట్ చేయించింది. దానికి వడ్డీకూడా చెల్లించడంలేదనే వివాదంకూడా ఈమధ్య చెలరేగింది. దేవాలయాల వ్యవహారాలను చూడటానికి ప్రత్యేకంగా ఒక ధార్మికమండలి ఏర్పాటుకావడం సముచితమని మరికొంతమంది పెద్దలు వాదిస్తున్నారు. ఆలయాలు, వాని ఆస్థులు, నిధులు అన్నీ హిందూసమాజపు భక్తకోటికి చెందిన ఉమ్మడి సొత్తు కాబట్టి దీనిపై రాజకీయవాదుల పెత్తనంగాని, హైందవేతరుల అజమాయిషీగాని, నాస్తికుల పెత్తనంగాని ఉండటం ఏమాత్రం సమంజసం కాదని కొందరు భావిస్తున్నారు. ఆలయాలు ఉన్నది హిందువులకోసం కాబట్టి ఆ ఆదాయమును హిందూధర్మ సంస్కృతీ ప్రచారానికి, అనాదిగా నిర్లక్ష్యం చేయబడిన హరిజన గిరిజనాది ఉపేక్షిత వర్గాలలో ధార్మిక ప్రచారానికి మాత్రమే వినియోగించాలేగాని మరి ఏ యితర కార్యక్రమాలకు వినియోగించరాదని కొందరు పెద్దలు వాదిస్తున్నారు. హిందువుల పట్ల ప్రభుత్వం వివక్షత చూపి దేవాలయాలకు ముప్పుతెస్తే దేశంలోని హిందువులు దానిని సహించరని విశ్వహిందూపరిషత్ హెచ్చరించింది. వక్ఫ్ బోర్డు, చర్చి కమిటీలకు జరుగుచున్న న్యాయమైన హిందూసంస్థలకు జరగాలని కొందరు భావిస్తున్నారు. ఏది ఏమైనప్పటికి ఇది చాలా సున్నితమైన విషయం. మత విశ్వాసాలను దెబ్బతీయడానికి అవకాశమున్న విషయం. కనుక హిందూసమాజంలో నున్న పీఠాధిపతులతోను, మఠాధిపతులతోను, హిందూ ధార్మిక సంస్థలతోను, న్యాయశాస్త్ర నిపుణులతోను ఒక "ధార్మికమండలి"ని ఏర్పాటుచేసి హిందూ దేవాలయాల విషయం చర్చించి సముచితమైన నిర్ణయం గైకొనడం ఒక మంచి సాంప్రదాయం.



# ఉక్కు మనిషి సర్దార్ వల్లభాయ్ పటేల్

"నేను ఒక్క బార్డోలీలోనేకాక భారతదేశ పౌరుడనని చెప్పుకో గల హక్కు నాకుంది. ఇది నా జన్మ హక్కు. ఎక్కడి నుంచో వేలమైళ్ళ దూరంనుంచి వచ్చి మాలో మాకు తగాదాలు పెట్టి, విభజించి పాలించే రాజకీయ చతురతకు నేను లొంగడం అసంభవం. ఇక్కడి ప్రజలను అమాయకులుగా భావించి వారి జీవితాలతో చెలగాడటం నేను ఏ మాత్రం సహించను. వరాయి వారి పెత్తనమును ఎదిరించి తీరుతాను." అని ఉద్రేక పూరితమైన ఒక లేఖను రెవిన్యూ అధికారికి శ్రీ వల్లభాయ్ పటేల్ పంపినారు.

కొమ్మిరెడ్డి కృష్ణమోహనరావు

## బార్డోలి సత్యాగ్రహం

1918 సంవత్సరంలో బార్డోలీ రైతుల (గుజరాత్‌లో) మీద మోయలేని, కట్టలేని భూమి శిస్తును అంగ్లేయ ప్రభుత్వం విధించింది. అంతేకాదు 30 సం. కాలంపాటు ఈ అదనపు భూమి శిస్తును చెల్లించాలని ఆదేశించింది. ఈ పన్నుల భారాన్ని మోయలేక, చెల్లించలేక, దిక్కుతోచక, ఆ అమాయక రైతులు సర్దార్ పటేల్ వద్దకు వెళ్ళి మొరపెట్టుకున్నారు. వారు పడుతున్న కష్టాలను చూచి పటేల్ మనసు ద్రవించింది. బార్డోలి రైతుల తరపున పోరాడటానికి పటేల్ నిశ్చయించుకున్నారు. గాంధీజీ, పటేలులు కలిసి ఆ చుట్టు ప్రక్కల గ్రామాలు పర్యటించారు. బార్డోలి ప్రాంతం తాము చేబట్టబోయే సహాయ నిరాకరణోద్యమమునకు అనువైన ప్రదేశమని భావించారు. అహింసాయుధంతో బ్రిటీష్‌వారిని ఎదిరించాలని నిశ్చయించుకున్నారు. 1922 సం. ఫిబ్రవరిలో ఉద్యమం ప్రారంభించారు. పన్నులు ఎట్టి పరిస్థితులలోను చెల్లించరాదని ప్రచారంచేసారు. ప్రభుత్వ ఆదేశం మేరకు పోలీసుల జులుం అధికమయింది. ప్రజలు కోపోద్రిక్తులై హింసకు దిగారు. గాంధీజీ ఆశయం హింసకాదు కాబట్టి బార్డోలి ఉద్యమం తాత్కాలికంగా విరమించుకోవలసివచ్చింది. గాంధీజీని అరెస్టు చేసారు. గాంధీజీ ఎడబాటు పటేల్‌కు తీరని బాధ కలిగించింది. పటేల్ బార్డోలీ తాలూకాలో మారుమూల గ్రామాలలో పర్యటించారు కుల, మత విచక్షణ చూడకుండా అందరిని ఏక త్రాటి క్రిందకు తీసుకొని వచ్చారు. ప్రభుత్వం రైతుల ఆస్తులను జప్తు చేయడం ప్రారంభించింది. రైతులను జైళ్ళకు పంపటం ప్రారంభమైంది. అయినప్పటికీ పటేల్ గ్రామ గ్రామాన తిరుగుతూ "మనలను దోపిడీ చేస్తున్న దొంగల నెదిరించడానికి భీరువులు కాకండి" అని రైతులను హెచ్చరిస్తూ ఉద్యమాన్ని నడుపుతున్నారు పటేల్. పటేల్ మాట ప్రకారం ప్రభుత్వం హెచ్చరిస్తున్నా రైతులు ఎవరి భూములు వారు సాగు చేస్తునే వున్నారు. "అహింసా సిద్ధాంతమే మనకురక్ష" అంటూ ప్రజలు ఉద్రేకానికి లోనుకాకుండా పటేల్ ప్రచారంచేయడం ప్రారంభించారు. ప్రభుత్వం జప్తు చేసిన భూములను ఇతరులకు అమ్మజూపింది. "బార్డోలీ రైతుల భూములలో అడుగు పెడితే ప్రాణాలతో తిరిగి వెళ్ళరు" అని పటేల్ వారిని హెచ్చరించారు. ఇతరులు ఎవరూ ఆ భూములను కొనడానికి ముందుకు రాలేదు. చివరికి పటేల్ అనుమతి లేనిదే ఆ ప్రాంతంలో కలెక్టర్ గారికి కూడా గుర్రపు బగ్గీ దొరకడం దుర్లభమైంది. అక్కడి వారందరూ "బార్డోలీ సర్దార్" అని పటేల్‌ను పిలచేవారు. ప్రభుత్వం ఎన్ని విధాల ప్రయత్నించినా, భయపెట్టినా బార్డోలీ ఉద్యమమును అణచలేక పోయారు. చిట్ట చివరికి గత్యంతరం లేక ప్రభుత్వమే ఒకమెట్టు దిగివచ్చి చర్చలకు

పటేల్‌ను ఆహ్వానించింది. బొంబాయిలో వైస్రాయితో చర్చలు జరిగాయి. రాజీ అనంతరం 32 శాతం నుండి 57 శాతం వరకు పన్నులు తగ్గించ బడినాయి. అప్పటి నుంచీ సర్దార్ వల్లభాయ్ పటేల్ బార్డోలీ వీరుడాయెను. ఒక్క తాలూకాలో జరిపిన సంఘటిత ఉద్యమానికి రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యాన్ని పాలిస్తున్న బ్రిటీషు ప్రభువులు సహితం తల వంచక తప్పలేదు.

## విద్యార్థిగా

చిన్నప్పుడు స్కూలులో పటేల్ చదువుకునేప్పుడు ఒక చిన్న సంఘటన జరిగింది.

" ఎక్కడ కొన్నావురా ఈ పుస్తకం" ఉపాధ్యాయుడు.

" బజార్లో పుస్తకాల కొట్లోనండి " పటేల్.

" నా దగ్గర కొనాలని నీకు తెలియదూ ? " ఉపాధ్యాయుడు.

" మీ దగ్గర చదువుకునేందుకేగాని బేరసారాలు చేయడానికి కాదండీ, నేను బడికి రావటం " పటేల్.

ఈ జవాబు విని ఉపాధ్యాయుడు ఉలిక్కిపడ్డాడు. అయినా గంభీరంగా " ఇదిగో, ఈసారి నువ్వు ఇతరత్రా పుస్తకాలు కొన్నావో ! బడికి రానివ్వను తెలిసిందా ? " అన్నాడు.

" మీకా కష్టం ఎందుకులెండి. నేనింక బడికిరాను, సార్ ! " అన్నాడు ఆ బాలుడు పటేల్. ఉపాధ్యాయుడు నిర్ఘాంతపోయాడు.

ఆ మరునాడు అతనే కాదు, ఆ తరగతి విద్యార్థులెవ్వరూ బడికి రాలేదు. పురప్రముఖులు జోక్యం చేసుకొని అందరిని శాంతపరిచారు. అందరూ బడికి వెళ్లారు.

ఈ కథ విన్నతరువాత, ఆ బాలుడు (పటేల్) కి భయభక్తులు లేవని కొందరు భావించవచ్చు కానీ అతడు అటువంటివాడు కాదు. అన్యాయాన్ని మాత్రమే ఎదిరించడం అతని మనస్తత్వం కాని వేరు కాదు. ఆ బాలుడు చాలా మంచివాడనడంలో ఏ మాత్రం సందేహం లేదు.



అతని మనస్తత్వం ఎటువంటిదో ఈ క్రింది సంఘటన మనకు ఋజువు చేస్తుంది.

## పురపాలక సంఘ ఎన్నికలు

ఆ ఊళ్లో పురపాలక సంఘ ఎన్నికలు వచ్చాయి. ఒక వార్డులో ఒక ధనవంతునితో ఒక సామాన్య బడి పంతులు పోటీ చేస్తున్నాడు. బడిపంతులు కనుక నెగ్గితే, తాను మీసం తీసివేస్తానని నలుగిరిలో ఆ ధనవంతుడు ప్రతిజ్ఞ చేశాడు. అది విన్నాడు ఆ బాలుడు ( పటేల్ ). ఎలాగైనా పంతులుగార్ని నెగ్గించాలనుకొని పిల్లలందర్ని కూడగట్టాడు పటేల్. ఇంటింటికి వెళ్ళి ప్రచారం చేశాడు. చివరికి ఆ ధనవంతుడు ఓడిపోయాడు. పటేల్ కొంత మందిని వెంటబెట్టుకొని మంగలివానిని తీసుకొని ఆ ధనవంతుని ఇంటికి వెళ్ళి " అయ్యా ! తమరు ఓడిపోతే మీ మీసం తీసివేస్తామన్నారుగదా ! మంగలి కూడా సిద్ధంగా ఉన్నాడు " అని అనడంతోనే అక్కడివారందరూ గొల్లున నవ్వారు.

## సాహసం

పటేల్‌కు చేతిమీద ఒక గడ్డ లేచింది. మందులెన్నో వాడారు. గడ్డ చితకలేదు. పైగా బాధ ఎక్కువైంది. గరిటె కాల్చి చురక వేస్తే గడ్డ పగులుతుందని ఒక ముసలాయన అన్నాడు. తల్లి అంగీకరించలేదు. వైద్యుని దగ్గరకు వెళ్ళి ఈ విషయం చెప్పాడు. ఆ వైద్యుడు ఒక సన్నని కడ్డీని ఎర్రబడేంతవరకు నిప్పుల్లో కాల్చాడు. కాని ఆ వైద్యుడు చురక వేయడానికి భయపడ్డాడు. అప్పుడు పటేల్ తనే ఆ కడ్డీని తీసుకొని తన గడ్డమీద చురక వేసుకున్నారు. గడ్డ పగిలింది. రక్తం కారింది. నొప్పి తగ్గింది. ఆ దృశ్యం చూచినవారందరూ "అయ్యో! అయ్యో" అన్నారు. పటేల్ మాత్రం చలించలేదు. పటేల్ చిన్నతనంనుంచి ఉద్దండపిండమే. పట్టుదల, ధైర్యం, సాహసాలు చిన్నతనంనుంచే అతనికి అబ్బాయి.

## మున్సిపల్ ఛైర్మన్

1924 లో అహమ్మదాబాద్ పురపాలక సంఘమునకు ఎన్నికైనాడు. ప్రతిరోజూ ఉదయాన లేచి అన్ని వీధులు తిరిగి ప్రజల సాధక బాధకాలను స్వయంగా తెలుసుకొని ఆ పట్టణమును తీర్చి దిద్దిన ఖ్యాతి ఆయనకు దక్కింది. 1927 లో పెనుతుఫాన్ విరుచుకుబడి అహమ్మదాబాద్‌ను ముంచివేసింది. మున్సిపల్ అధ్యక్షుడుగా ఆనాడు ఆయన చేసిన సేవ అసామాన్యమైనది. కడు సమర్థుడైన పరిపాలనా దక్షుడుగా ఆయన ప్రశంసల నందుకున్నాడు.

## ప్లేగువ్యాధి

1917 లో అహమ్మదాబాద్‌లో అతి భయంకరమైన ప్లేగు వ్యాధి వ్యాపించింది. ఆఫీసులు, పాఠశాలలు అన్నీ మూసివేశారు. అప్పుడు అహమ్మదాబాద్ పురపాలక సంఘ సభ్యుడుగా పటేల్ ఉండేవాడు. ఆ భయంకర వ్యాధికి అతను భయపడలేదు. ప్రతిరోజు వివిధ వార్డులకు వెళ్ళి రోగులను పరామర్శించడమేగాక అవసరమైన సహాయాన్ని అందించేవాడు. అంతేకాదు స్వయంగా ఆ రోగులకు సపర్యలు చేసేవాడు. మందులు యిచ్చేవాడు. ఇంటింటికీ తిరుగుతూండగా ఒక ఇంట్లో ఇంటి ల్లిపాదికి ప్లేగు వ్యాధి సోకినట్లు గ్రహించి, ఆ ఇంటి ల్లిపాదికి సేవ చేస్తూ, మందులిస్తూ అక్కడే కొన్నిదినములు గడిపాడు. ఆయన శ్రమ ఫలితంగా ఆ ఇంట్లో ఒకరు తప్ప అందరూ బ్రతికి బయటపడ్డారు. అయితే పటేల్‌కు కూడా ప్లేగు వ్యాధి సోకింది. అతి కష్టంమీద మృత్యు దేవతను ఎదిరించి బయటపడ్డాడు పటేల్.

## స్వాతంత్ర్యఉద్యమం

స్వాతంత్ర్య ఉద్యమంలో అగ్రభాగాన నిలబడి బ్రిటీష్ వారిని గజగజలాడించిన వీరాధివీరుడు. ప్రజాఉద్యమాలను నడిపిన రథసారధి. గాంధీజీకి కుడి భుజంగా నిలబడి స్వాతంత్ర సంగ్రామంలో వీరోచితంగా పోరాటం కొనసాగించిన ఉక్కుమనిషి (IRON MAN OF INDIA)గా పేరు ప్రఖ్యాతుల నందుకున్న మహావీరుడు. నెహ్రూ, పటేల్‌ల మధ్య ఎన్ని రాజకీయ అభిప్రాయ భేదాలున్నా వ్యక్తిగతంగా మంచి స్నేహితులుగా మసలుకొనేవారు. ఆనాటి ఇస్లాం నాయకులు పటేల్ హిందూ పక్షపాతని నిందించేవారు. అతను పక్షపాత వాదికాదు, యదార్థవాది. "యదార్థవాది లోకవిరోధి" అనే సామెత ఆయన విషయంలో యదార్థం అని భావించడానికి కూడా వీలు లేదు. నాయకుల అభిమానం ఆయనకు లేకపోయినా ప్రజల అండ మాత్రం ఆయనకు ఉండేది. నిర్మోహమాటంగా స్పష్టంగా మాట్లాడటం ఆయన అలవాటు. పటేల్ ఒక పర్యాయం లక్నో సభలో ప్రసంగిస్తూ "నాకు మనసులో ఒకటి పైకొకటి వుంచుకొని ప్రవర్తించుట చిన్నతనం నుంచీ అలవాటు లేదు. మొహమాటం కోసం, మెప్పును పొందడానికోసం తీయటి కబుర్లు చెప్పడం నాకు చేతకాదు. ఇష్టం అంతకన్నా లేదు. మహమ్మదీయులయినా హిందువులైనా దేశభక్తులమని చెప్పుకోవటం కాదు. కార్యాచరణలో చూపించాలి. జిన్నా నాయకత్వంలో పాకిస్థాన్ కావాలని కొందరు ముస్లిములు కోరినప్పుడు, మిగిలిన ముస్లిములు ఎందుకు ఖండించలేక

### కురుక్షేత్ర మహాసంగ్రామం

కురుక్షేత్ర మహాసంగ్రామం పాండవులు, కౌరవుల మధ్య జరిగింది. ఆ యుద్ధములో పాల్గొనిన సైన్యం - పాండవుల బలం 7 అక్షౌహిణులు, కౌరవుల బలం 11 అక్షౌహిణులు. ఒక అక్షౌహిణి అనగా 21,870 రథములు, 21,870 ఏనుగులు, 65,610 గుర్రాలు 1,09,350 కాల్బలం. మొత్తం 18 అక్షౌహిణులు యుద్ధంలో పాల్గొనినారు. అంటే 3,93,660 రథములు, 3,93,660 ఏనుగులు 11,80,980 గుర్రాలు, 19,68,300 కాల్బలం. ఆ యుద్ధంలో దాదాపు అందరూ వీర మరణం పొందారు.

పోయారు ? " అని పటేల్ ప్రశ్నించగా పటేల్ ముస్లిం వ్యతిరేకని ఆనాడు ప్రచారం చేశారు. ఆదిలో పాకిస్థాన్ నిర్మాణాన్ని గట్టిగా వ్యతిరేకించాడు. ఆనాటి పరిస్థితుల ప్రభావం వలన దేశ విభజనకు పటేల్ తల వంచక తప్పలేదు

## పదవికోసం

పటేల్ పదవికోసం ఏనాడూ పరిగెత్తలేదు. ప్రథమ భారత ప్రధాన మంత్రిగా పటేల్ ఉండాలని మొత్తం 15 రాష్ట్రములలో 12 రాష్ట్రములవారు బలపరచారు. అయినప్పటికీ గాంధీజీ జోక్యం చేసుకొనగా పండిత నెహ్రూ ప్రధానమంత్రి పీఠాన్ని అలంకరించారు. పటేల్‌ని ఉప ప్రధానిగా చేయడం జరిగింది. నెహ్రూ విదేశీ వ్యవహారాలను చూచుకొనుచుండ, పటేల్ అంతరంగిక వ్యవహారాలమీద కేంద్రీకరించారు. భారత దేశంలోగల 500 స్వదేశీ సంస్థానములను భారత రిపబ్లిక్‌లో విలీనం చేయడానికి పటేల్ చేసిన కృషి అద్వితీయం. వారందరిని నయాన భయాన, లాలించి బెదిరించి అంగీకరింపజేయించిన ఘనత పటేల్‌కే దక్కింది. కాశ్మీర్ విషయంలో పటేల్‌ని కాదని పండిత నెహ్రూ జోక్యం చేసుకోవడం వలన ఈనాటికీ రావణాసురుని కాష్టములా తగలబడుతూనే ఉన్నది. హైద్రాబాద్ విషయంలో పటేల్ అనుసరించిన దృఢ వైఖరి వలన నిజాం ప్రభువు పటేల్‌కు పాదాక్రాంతుడై భారతరిపబ్లిక్‌లో చేరిపోయినాడు. ఆనాడు పటేల్ నిజాంపై పోలీస్ యాక్షన్ తీసుకొనని యెడల భారత నడిబొడ్డులో మరొక పాకిస్థాన్ ఏర్పడి భారత దేశానికి భద్రత లేకుండా పోయేది. ఈనాడు కనీసం ఇట్లాగయినా భారతదేశ సమగ్రత నిలబడి ఉన్నదంటే అది సర్దార్ పటేల్ భిక్షే. పండిత నెహ్రూకు బదులు ఆనాడు సర్దార్ పటేల్ ప్రధానమంత్రి అయి వుండిన యెడల భారతదేశం భవిష్యత్తు మరింత ఉజ్జ్వలంగా ఉండేదేమో !

నిరంతరం దేశం గురించీ ప్రజల గురించీ ఆలోచిస్తూ నిర్విరామ కృషి సలుపుతూ, విశ్రాంతిని ఎరుగని మహావీరుడు పటేల్. కర్తవ్య పరాయణత్వంలో అహర్నిశలూ కృషిచేయడం వలన ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. 1950 డిశంబరు 12 వ తేదీన విశ్రాంతి కలుగ జేయాలనే ఆలోచనతో కొంతమంది మిత్రులు బొంబాయిలోని మలబార్ హిల్స్‌లోని బిర్లామందిరానికి పటేల్‌ని తీసుకొని వెళ్ళారు. అయితే దురదృష్టవశాత్తు విశ్రాంతి ఎరుగని ఆ మహావీరుడు 15 వ తేది తెల్లవారు జామున శాశ్వతంగా విశ్రాంతి తీసుకున్నాడు. ఆయనకు మణిబెన్ కూతురు. దయాభాయ్ కుమారుడు. 1875 సం॥ అక్టోబర్ 13 వ తేది ఆయన జన్మదినం. పటేల్ నేడు మన మధ్య లేకపోవచ్చు. ఆయన చేసిన, సాధించిన మహత్కార్యాలను మాత్రం ఏనాటికీ మనం మరువ లేము. నేటి పాలకులు సర్దార్ పటేల్ నుంచి నేర్చుకోవాల్సింది ఎంతో ఉన్నది. అయితే ఆయన ఉజ్జ్వల జీవిత చరిత్రను చదవని వారు నేడు అధికారంలో ఎందరున్నారో ? ఇది కొంచెం ఆలోచించ వలసిన విషయమే.

# గాంధీ హత్య? నాథూరాంగోడ్సే వాఙ్మూలం

" దేశాన్ని ప్రేమించడం పాపమని భావిస్తే నేనూ పాపినే .... ఒకవేళ అది శ్లాఘించ దగినదే అయితే ఆ కీర్తికి నేను అర్హుడను. మనుష్యులచే నడప బడే ఈ న్యాయస్థానాల కన్నా పైన యింకొక న్యాయ స్థానం ఉన్నదని నేను విశ్వసిస్తాను. అక్కడ నేను నేరస్థుడిని కాను, దేశానికీ జాతికీ మేలు చేయడానికే నేను ఈ పని చేశాను. ఏ వ్యక్తి ప్రవర్తనతో హిందువులకు అత్యధికమైన విపత్తు సంభవించినదో, హిందువులు సర్వనాశనమైపోయినారో, ఆ వ్యక్తిపై నేను తుపాకి గుండ్లను కురిపించాను. గాంధీజీ నిరాహార దీక్షతో పాకిస్థాన్‌కు 55 కోట్ల రూపాయలు యివ్వకూడదనుకున్న భారత ప్రభుత్వం తమ నిర్ణయాన్ని మార్చుకుంది. ప్రజల అభిప్రాయాలకంటె పాకిస్థానీయులను సంతోషపరచి గాంధీజీ నీతికే ఎక్కువ ప్రాధాన్యాన్ని ఇచ్చినట్లు నాకు అనిపించింది. భారతదేశ విభజనలో గాంధీ మోసం చేశారు. ఆయనను శిక్షించే చట్టం గాని, న్యాయస్థానం గాని లేని కారణాన నేనే గాంధీని హతమార్చాను " అని గాంధీజీని కాల్చి చంపిన నాథూరాం గోడ్సే నాయస్థానంలో యిచ్చిన వాఙ్మూలం సారాంశం.

గాంధీజీ హత్య యావత్ ప్రపంచంలో అత్యంత ఆశ్చర్య చకితులను గావించింది. భారతదేశ స్వాతంత్ర్యోద్యమనేత, జాతిపితను హత్య చేయటమేమిటని పలువురు ముక్కుమీద చేయి వేసుకున్నారు. భారత ప్రజలు ఆవేశ ఆక్రోశాలను ప్రకటించారు. హత్యచేసినవారిని ప్రత్యేక కోర్టులో విచారించి అందులో నాథూరాం గోడ్సే, నారాయణ ఆప్టేలను ది 15.11-1949 ఉ॥ 7-15 గంటలకు అంబాలా సెంట్రల్ జైలులో ఉరి తీశారు. గోపాల్ గోడ్సే, విష్ణు కర్కరే, మదన్‌లాల్ పహ్వాలకు జీవిత శిక్ష విధించబడి ది 13-10-64 న విడుదలయినారు. వినాయక్ దామోదర్ సావర్కర్ నిర్దోషి అని న్యాయస్థానం నిర్ణయించి, ది 10-2-49 న విడుదల చేసింది. గాంధీజీ ఎవరి చేతులలో హత్య గావించబడినాడో ఆ వ్యక్తే నాథూరాం గోడ్సే.

నాథూరామ్ గోడ్సే న్యాయ స్థానంలో చేసిన వాఙ్మూలము కోసం ఆనాడు ఎందరో ఎదురు తెన్నులు చూసారు. అయితే ఆ వాఙ్మూలమును పూర్తిగా గాని, దానిలోని భాగములనుగాని ప్రచురించుటను ప్రభుత్వం నిషేధించినది. అందువలన ఆనాడు అది బయటకు రాలేదు. అయితే ఈమధ్యనే ఆంగ్లంలో " మే ఇట్ ప్లీస్ యువర్ ఆనర్" అను పేరుతో గోపాల్‌గోడ్సే (నాథూరామ్ గోడ్సే సోదరులు) ఒక పుస్తకం వెలువరించారు. దానిని శ్రీ సి. హెచ్. రమణయ్య తెలుగులోనికి అనువదించారు. ఈ పుస్తకంలో నాథూరామ్స్ గోడ్సే న్యాయస్థానంలో ఆనాడు యిచ్చిన సమాచార వివరాలున్నాయి. ఈ పుస్తకమును చదివితే గాంధీజీని హత్య చేయడానికి ప్రోద్బలం కలిగించిన మూల కారణాలు ద్యోతకమవుతాయి.

" గాంధీజీపై తుపాకీ గుండ్లు కురిపించి న ప్పుడే నా జీవితం ముగిసింది. అప్పటినుంచి నేను ధ్యాన నిమగ్నుణ్ణయి ఉన్నాను. గాంధీజీ జాతి కోసం కష్టపడ్డాడని నేను ఒప్పుకుంటున్నాను. ఆయనకు ఆయన సేవలకూ నా నమస్కారం. కాని అంత దేశ భక్తునికి కూడా దేశ ప్రజలను మోసగించి దేశాన్ని విభజించే హక్కు లేదు. నాపైన జాలి చూపాలని నేను కోరడంలేదు. నా పక్షాన ఎవరైనా క్షమాభిక్షకు పూనుకోవాలని కూడా నేను కోరడం లేదు. దేశభక్తి పాపమైతే ఆపాపం నేను చేసానని ఒప్పుకుంటాను. అది మహనీయ గుణమైతే ఆ మహనీయత్వం నాకు దక్కాలని సవినయంగా ఆశిస్తాను. ఎన్ని దృక్కోణాలతో విమర్శించినా నైతికంగా నేను చేసినపని మంచిదే

నన్న విశ్వాసం సడలలేదు. భవిష్యత్తులో నిజాయితీ ఉన్న చరిత్రకారులు నా పనికి విలువకట్టి సత్యాన్ని తెలుసుకుంటారనడంలో నాకేమీ సందేహం లేదు. '' అని నాథూరాంగోడ్సే (8 - 11 - 1948) న్యాయస్థానంలో తన వాదనను వినిపిస్తూ అంటాడు.

ప్రతి వ్యక్తి తాను చేసిన పనిని సమర్థించుకోవడానికి అనేక కారణాలు చెప్పడం సహజం. తాను చేసిన తప్పును సమర్థించుకోవడం కూడా పరిపాటే. అయితే నాథూరామ్ గోడ్సే గాంధీజీని హత్య చేయటానికి గల కారణాలు ఈ మొత్తం పుస్తకం పరిశీలనా దృష్టితో చదివితే కొంత బోధపడుతుంది. ఈ రచయిత అభిప్రాయాలతో నేను పూర్తిగా ఏకీభవించక పోయినప్పటికీ, ఆనాటి యదార్థ వాస్తవిక పరిస్థితులను చక్కగా మాత్రం వివరించడం జరిగిందని అభిప్రాయపడుతున్నాను.

జస్టిస్ ఖోస్లా తన పదవీ విరమణ తరువాత తన మనో నేత్రము ముందు చూచిన ఆనాటి న్యాయస్థాన దృశ్యమును సంక్షిప్తముగా వర్ణిస్తూ ఈ విధంగా అన్నారు. " మీ ముందువున్న అప్పీలులో అందరినీ ఆకర్షించిన ప్రముఖ విషయము నాథూరాం గోడ్సే తనను తాను సమర్థించుకుంటూ చేసిన ఉపన్యాసము మొదట కేసుకు సంబంధించిన వాస్తవాలను తర్వాత తాను మహాత్మాగాంధీని అంత మొందించుటకు నిర్ణయించుకొనుటలో ఏ ఉద్దేశ్యములు ప్రోత్సలము చేసినది చర్చించుతూ చాలా గంటలసేపు మాట్లాడినాడు .... ప్రేక్షకులు కనబడేటట్లు, వినబడేటట్లు చలించి పోయినారు. ఆయన మాట్లాడటం నిలపగానే అంతా నిశ్శబ్దముగా వుండిపోయినది. మహిళల కళ్ళు కన్నీరుతో నిండినవి. పురుషులు దగ్గుతూ చేతిగుడ్డల కొరకు తడుముకో సాగినారు. అక్కడక్కడ అణచు కొంటూ చేసే ఉచ్ఛ్వాసాలు, లేక అపుకోబోయిన దగ్గు ఆ నిశ్శబ్ద వాతావరణంలో నిశ్శబ్దాన్ని మరింత ప్రస్ఫుటం చేసినవి ... అయినప్పటికీ, అచ్చటి ప్రేక్షకులను పంచాయితీ (జ్యూరీ) గా ఏర్పరచి గోడ్సే అప్పీలుపై నిర్ణయము చేయు పనికి ఒప్పచెప్పియుంచే వారు అత్యధిక సంఖ్యలో " నేరము చేయలేదు '' అనే అభిప్రాయమును వెలిబుచ్చి వుండేవారు అనుటలో నాకెలాంటి సందేహము లేదు. '' అని అన్నారు.

జస్టిస్ ఖోస్లాలాంటి ప్రముఖ న్యాయాధీశులే నాథూరామ్ గోడ్సే వాదనను విని చలించిపోయినారంటే ఇక సామాన్యుల విషయం మరి వేరే చెప్పనవసరం లేదు.

నాథూరామ్‌గోడ్సే తన తమ్ముడైన దత్తాత్రేయ వినాయక గోడ్సేకి హిందీలో వ్రాసిన లేఖలో తన మరణానంతరం ఏ విధంగా చితాభస్మ నిమజ్జనం చేయాలో వివరించాడు " ఏ నదీతీరములలో నైతే చరిత్రకు అందని కాలంలో మన ఋషులు వేదములను రచించి గానం చేసారో ఆ సింధూ నది మన భారత వర్షమునకు అనగా హిందూస్థానమునకు సరిహద్దుగా వున్నది. హిందూస్థానపు విజయ కేతన చ్ఛాయలలో ఆ నది ఎప్పుడు స్వేచ్ఛగా ప్రవహిస్తుందో అప్పుడు ఆ పవిత్ర సింధూ జలాలలో నా చితాభస్మ నిమజ్జనము చేయవలసినది. ఆ దినమే మనకు పవిత్రమైన దినము. నాకోరిక నెరవేరుటకు ఒకటి రెండు తరములు పట్టినా పట్టవచ్చు గాక. అప్పటివరకు ఈ చితా భస్మమును భద్రపరచి పెట్టవలసినది. నీ జీవిత కాలములో ఆ శుభదినము ఉదయించనిచో నా కోర్కెను నెరవేర్చుటకు ఆ అవశేషములను భవిష్యత్ తరములకు అందజేయవలసినది. న్యాయస్థానములలో నేను చేసిన ప్రకటనపై ప్రభుత్వం నిషేధం తొలగించినప్పుడు దానిని ప్రచురించుటకు నీకు అధికారము యిచ్చుచున్నాను'' అని నాథూరామ్ గోడ్సే తన ఆవేదనను వెలిబుచ్చుతాడు. ఈ లేఖను బట్టి అతనికి భారతవర్షం యెడల ఎటువంటి భక్తి ప్రపత్తులు కలిగి వుండేవాడో అర్థం చేసుకోవచ్చును. ఆయన కరడుగట్టిన దేశభక్తుడే అనుటలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

1949 నవంబరు 15 వ తేది ఉదయం అంబాలా జైలులో ఉరి తీయడానికి ఉరికంబం వద్దకు తీసుకువెళ్ళడానికి భటులువస్తారు. అప్పుడు జైలు అధికారి వైపుకు

## జనం!

రేషన్ షాపులో బ్లాక్
జరుగుతున్నప్పుడు
గుడ్లెర్రచేసి చిత్తుగా ఎగిరిపడతారు !
సినిమా థియేటరులో బ్లాక్
జరుగుతున్నప్పుడు
గమ్మగా టిక్కెట్లు కొంటారు జనం !
ఆశ్చర్యం ! ఒకచోట సమరం !
మరోచోట 'మౌనం' !

— పిరమిడ్ రైటర్

చూచి "శ్రీ మాన్‌జీ ! మీకు జ్ఞాపకం ఉందా ! నేను ఒకసారి మీతో అన్నాను. ఉరిత్రాడును గురించి నేను లెక్క పెట్టను. కాని ఉరిత్రాడులో ఊగులాడే ముందు ఒక కప్పు తేనీరు మాత్రం తప్పకుండా ఇవ్వాలని. ఆ కప్పు వంతు ఇప్పుడు వచ్చినది ! మీకు నా కృతజ్ఞతాభి వందనములు." అధికారులు యిచ్చిన తేనీరు త్రాగి నాథూరామ్, నారాయణ ఆప్టేలు జీవితం ఆవలివైపుకు ప్రయాణం ప్రారంభించినారు. వారు భగవద్గీత, అఖండ భారతదేశ పటము, కాషాయి జండాలు పట్టుకుని "అఖండ భారత్ అమర్ రహే ! వందేమాతరం" అంటూ ముందుకు నడుస్తారు.

వేదిక సమీపించగానే మాతృదేశమునకు భక్తిని చూపు గీతమును పఠించుతారు,

"నమస్తే సదావత్సలే మాతృభూమే,
త్వయా హిందు భూమే సుఖం వర్ధితోఽహం
మహా మంగళే పుణ్యభూమే త్వదర్థే
పతద్వేషకాయో నమస్తే ! నమస్తే !

అనగా "సర్వదా నీకు నమస్కారం. ఓ పవిత్ర మాతృదేవీ ! ఈ హిందూభూమి వడిలో నీచే సుఖముగా పోషింపబడినాను. అత్యంత మంగళకరమైన ఓ పవిత్ర భూమీ ! నీ కొరకు నా ప్రాణములను సమర్పిస్తాను. నమస్కారములు నీకు, నమస్కారములు నీకు" అంటాడు నాథూరామ్. వారి చేతులు వెనుకకు విరిచి కట్టబడుతాయి. ఉరిత్రాడు తగిలించబడుతుంది. అధికారి ఆజ్ఞాపిస్తాడు. ఆ నిశ్శబ్ద వాతావరణంలో వందేమాతరం నినాదం మారుమ్రోగుతుంది. మీట నొక్కుతారు. వంతెన తెరచుకొంటుంది. ఉరిత్రాడుబిగిస్తుంది. వారిద్దరూ భరతమాత ఒడిలో పడి శాశ్వతంగా నిద్రపోతారు.

ఆనాటి యదార్థ వాస్తవిక పరిస్థితులను తెలుసుకోవడానికి ఈ పుస్తకం బాగా తోడ్పడుతుంది. విమర్శలకు యిది ఒక మంచి అవకాశం. మహాత్మా గాంధీజీలాంటి మహనీయుడ్ని చంపడం న్యాయమా ? అనే సందేహం సహజంగా అందరిలో ఉదయిస్తుంది. పూర్వాపరాలను, ఆనాటి రాజకీయ నిర్ణయాలను తెలుసుకున్నప్పుడు నాథూరాం చేసిన పని తప్పుకాదేమోనని అనిపిస్తుంది. ఏది ఏమైనప్పటికీ, అతడు ఎంత దేశభక్తుడైనప్పటికీ ఇటువంటి దుస్సాహసానికి ఒడి గట్టడం మాత్రం న్యాయం కాదు. అయితే ఆనాడు నాథూరాం పడిన ఆవేదన, అఖండభారతం యెడల అతనికి ఉన్న అచంచలమైన ప్రేమ, మాతృదేశం యెడల గల దేశభక్తి ఈ ఘోరకలికి పురిగొల్పిందేమోననిపిస్తుంది. మొత్తానికి ప్రతి మేధావి చదువవలసిన వివాదాస్పదమైన పుస్తకం (CONTROVERSIAL BOOK)

"గాంధీ హత్య ? నాథూరాం గోడ్సే వాఙ్మూలం"

వెల : రు 15-00

ప్రతులకు : 1. సాహిత్య నికేతన్,
3-4-852, బర్కత్‌పూరా
హైదరాబాద్ - 500 027

2. సాహిత్య నికేతన్
ఏలూరురోడ్, విజయవాడ - 2

# నీతి లేనివాడు కోతికంటే హీనుడు

విద్యార్థినీ విద్యార్థులకు నైతిక విద్య అవసరము. తద్వారా విద్యార్థులకు మానవత్వంలోని దివ్యత్వమును గుర్తించుటకు అవకాశముంటుంది. ప్రాచీన కాలమున సత్యము సత్ప్రవర్తన సౌందర్యముల నిమిత్తమై సరస్వతిని ఆరాధించెడివారు. సత్య సత్ప్రవర్తనలతో కూడినట్టిదే సహజ సౌందర్యము.

## నైతిక నిబంధనలు

మానవునికి వివేక ఇంద్రియ నిగ్రహముల నిమిత్తమై శిక్షణ అవసరము. జీవితయాత్రలో తన ప్రవర్తన కొరకు మానవుడు కొన్ని నైతిక నిబంధనలను ఏర్పరచుకొని నాడు. వీనిని నైతిక నిబంధనలు అని అనవచ్చును. నైతికము అనగా పవిత్రము అని అర్థము. క్రమముతో కూడిన ప్రవర్తన 'నీతి' యొక్క అంతరార్థము. ఇది మానవుని ఉన్నతస్థాయికి చేరుస్తుంది. వ్యక్తికి, సమాజమునకు, రాజ్యమునకు నీతి లేకున్న పతనమునకు దారి తీయును. నీతి లేకున్న జాతి చెడును. ఈనాడు నీతి లోపించుటచేత మానవుడు క్షీణించుచున్నాడు. ప్రాణమునకు నీతి సారము. జీవితమునకు ఆదర్శము.

## నీతిలేనివాడు

నీతి లేనివాడు కోతికంటే హీనుడు. కాని కోతి కొంతవరకు ఆదర్శమునందించుచున్నది. డార్విన్ శాస్త్రజ్ఞుడు "నేనులేక నీవులేవు" అన్నాడు. దీనిని గ్రహించుట అసాధ్యము. దీనిని కోతి సత్యముగా నిరూపిస్తూ వచ్చింది. "ఓ మానవా! నేనులేక నీవులేవు. ఆకారం ధరించిన నీ మనస్సే నేను. నీచేత తినిపించేది నిన్ను నడిపించేది నేను. కనుక జగత్తును మురిపింపచేసి దైవాన్ని మరిపింప చేసేది నేను. కనుక ఓ మానవా! నీ మనస్సేకోతినైన నేను. కాని నీకంటే ఉత్తముడ్ని. నేను రామసేవ చేసాను. నీవు కామసేవ చేసినావు. నేను రామదాసుడ నగుటచేత కాముడు నాకు దాసుడు. కాముడు రాక్షసుడు రాముడు భగవంతుడు. చెట్టు, ఉడత, పిట్ట, కోతి అంతా రామసేవ చేసినవారమే. కాని మానవుడు చేసినదేమి? సీతను కష్టాలుగావించినది, రాముని అవస్థల పాలు చేసినది నీవే. నాకైనా క్షణమైన స్థిరముండునేమో గాని నీకు అదీలేదు." కనుక మానవుని కంటే కోతి మేలు.

**శ్రీ సత్య సాయి బాబా**

## దైవాంశము

నైతిక విలువలను అభివృద్ధిగావించుకొని దైవత్వమును వ్యక్తపరచుకొనుటే మానవత్వము. 'వ్యక్తి' అను పదమును సంస్కృతమున పౌరుషమని అందురు. ఇట్టి వ్యక్తి, పౌరుష అను పదములు సామాన్యములైనవికావు. ఆంగ్లమున వ్యక్తి పదమును Person అంటారు. ఇది రోమన్ పదమైన Persona అను పదమునుండి ఆవిర్భవించినది. Persona అనగా దైవాంశము అని అర్థము. ప్రతి వ్యక్తి దైవాంశమే. కాని అందరూ వ్యక్తపరచలేరు. గోప్యమైన దివ్యత్వమును వ్యక్తీకరించాలి. దీనికి నీతి నిజాయితీలు అవసరము. సత్ప్రవర్తనయను ఆదర్శము వలన మనిషి ప్రకాశిస్తాడు. సదాచార, సచ్చింతనలు లేకున్న ప్రకాశించలేడు.

## భారతీయ సంస్కృతి

ఒక్క గూటిలోని పక్షులవలె, ఒక్క తీగెలోని పువ్వులవలె, ఒక తల్లి పిల్లలవలె, ఒక జాతి పౌరులవలె సహజీవనం గరపాలి. ఇదియే భారతీయ సంస్కృతి. దీనిని గ్రహించి మానవత్వమును సార్థకం గావించుకోవాలి. చెడ్డ కార్యములు కాని, మంచి కార్యములుగాని విత్తనముల వంటివి. భూమిలో నాటిన తరువాత తన దేహమును

దగ్గంగావించుకొనిన పిమ్మట విత్తనములు మొక్కగాను, వృక్షముగాను వృద్ధియగును. అటులనే మనసులోని భావములు మంచివయినప్పుడు ఫలితములు మంచివి యగును. చెడ్డ భావములు మనసున చేరినప్పుడు చెడ్డ ఫలితములు వచ్చును. ఈ సంకల్ప ఫలములే అనుభవమున సుఖదుఃఖములు.

## MANAGEMENT

ప్రపంచమునందేదేశమునందైనను కర్తవ్యము ఆ దేశముయొక్క సంస్కృతిపై ఆధారపడి వుంటుంది. ఒక దేశ సంస్కృతియొక్క విలువ మరొక దేశ సంస్కృతి విలువలకు విరుద్ధంగా ఉండవచ్చును. అమెరికా, జపాన్, ఇంగ్లాండు దేశాలలో Management వేరువేరు మార్గాలలో ఉన్నది. అమెరికాలో Management అహంకారముతో కూడుకొన్నది. అనుకరణలో ఉన్నటువంటిది. Competition తీవ్రంగా కలిగినట్టిది. ఇది భారతదేశమునందు అభివృద్ధిగావించుటకు వీలులేదు. భారతదేశమున వస్తూత్పత్తికి అధికముగా వాంఛించుచున్నాము. ఎక్కువ పదార్థమును అమ్మకము చేసి అధిక లాభాలను వాంఛిస్తున్నాము. శ్రామికుల స్థితి ఆ దేశముయొక్క పరిస్థితినను సరించి ఉంటుంది. అమెరికానందు అవసరమైన తరువాత పనిలోనుండి శ్రామికులను తొలగించు పద్ధతి ఉన్నది. మానవత్వ విలువలు శూన్యము. అర్థిక విలువలే ప్రధానము భారతదేశమువందు ఈ అమెరికా Management అనుసరించిన ఫలితముండదు. జపాను సంస్కృతినందు శ్రామికులకు స్వాతంత్ర్యమధికము. యాజమాన్యమునకు శ్రామిక వర్గానికి గాఢ సంబంధమున్నది. అక్కడ సమ్మెలు లేవు. ఒకవేళ అసంతృప్తివుంటే నిరసనగా ఫ్యాక్టరీలో అధికంగా కృషి చేయడం వారి సాంప్రదాయం. ఇట్టి సహనం ఉండుటవలన జపాన్‌నందును Management అభివృద్ధిగాంచినది. ప్రతి దేశమునందు Statistics, Accounts, Production సమానమైన ప్రాతిపదికలో నుండును. కాని అక్కడ మానవత్వ విలువలకు అవకాశం లేదు.

## అనుకరణ కాదు

ఈనాడు ప్రపంచంలో M. B. A. చాలావరకు అనుకరణ (Imitation) గా వుంటుంది. మన దేశంలో ఇట్టి అనుకరణ పనికిరాదు. ఈనాడు మన విద్యాలయంలో విలువలకు, సంస్కృతికి స్థానమున్నది. అనుకరణ ధన వ్యయమునకు, కాలవ్యర్థమునకు, కొంతవరకు స్పర్ధలకు కారణమగుచున్నది. " Imitation is Human, but creation is Divine " ఇట్టి దివ్యత్వమువలన పవిత్రత అభివృద్ధిగావించాలి. ఏ దేశ పద్ధతి ఆ దేశమునకు మంచి నందించును. Blind Imitation పనికిరాదు. దేశ పాత్రలననుసరించి ప్రవర్తించాలి. మన దేశ సంస్కృతి మన విలువలు ఇతర దేశములకంటే భిన్నమైనటువంటివి. అందువలననే మన M. B. A. కోర్సులో Indian Ethos and Human Values లకు అవకాశం కల్పించబడింది. మరియు Indian Economic Environment, Personal Management, Organisational Values, Organisation Behaviour, Business Communication, Personal Development మొదలగునవన్నియు M. B. A. లో చేర్చబడినవి. Computor వినియోగము Practical Management విషయములను Indian Ethos and Values లక్ష్యము నందుంచుకొని బోధించబడును మనదేశమున ఏ విద్యాలయంలో కూడ ఇవిలేవు. Workers ఒక తల్లి పిల్లలవలె మెలగవలెనన్న Indian Ethos, Valuesను అనుసరించి దైనందిన కార్యక్రమము మౌనప్రార్థనతో ప్రారంభించాలి. ఇది వారి మధ్య అన్యోన్యత భావమును కలిగించి ఆనందమను అనుభవాన్ని అందిస్తుంది.

## భారతీయ విద్య

ప్రాచీన కాలములో గ్రీసు దేశమున ' Sparta ' అను రాజు ఉండేవాడు. అతనికి ఒక ఆధ్యాత్మిక గురువు ఉండేవాడు. ఆ రాజు ఆజ్ఞప్రకారము అతను ఆసియాలోని అన్ని దేశములలో విద్యావిధానమును పరిశీలిస్తూ భారతదేశానికి చేరుకున్నాడు. ఇక్కడి విద్యావిధానాన్ని

చూచి ఆశ్చర్యపోయాడు. ఆనాడు మనదేశంలో విశ్వ విద్యాలయాలు లేవు. లేబరేటరీలు, ఆడిటోరియములు అంతకన్నా లేవు. అడవులలో ఒక మహనీయుడు చెట్ల క్రింద విద్యను బోధించేవాడు. అతని ఆశ్రమమే ఒక విశ్వవిద్యాలయం. గురువులమీద ఎంతో భక్తితో ఎట్టి ఫిర్యాదులు చేయకుండా విద్యార్థులు విద్యాభ్యాసం చేస్తూ వుండటం ఆయన గమనించాడు. కొందరు విద్యావంతు లతో సంభాషణగావించాడు. భారతీయ విద్యలోని నీతి నిజాయితీలను గమనించాడు. మన వేదాంత గ్రంథము లను పఠించాడు. సత్యవాక్కుకు సత్యప్రవర్తనకు మన దేశంలో ఉన్న స్థానం ఎంతటిదో గమనించాడు. మన దేశములో ఉన్నత విలువలకు ముగ్ధుడై గ్రీసుదేశంలో వాటిని అనుసరింపజేయడానికి ఎంతో కృషి చేసాడు. ఈ పద్ధతిని చాలావరకు అలెగ్జాండర్ అనుసరించాడు. మన దేశంనుంచి గంగాజలాన్ని, మట్టిని, గీతాగ్రంథమును తనతో తీసుకొని వెళ్ళాడు. అయితే దురదృష్టవశాత్తు ఈనాడు ఈ పవిత్రత మనలో లోపించింది. దీపం క్రింద క్రీనీడ యున్నట్లు మనం ఇతరులను చూచి భ్రమిస్తున్నాం. కనుక మన M. B. A. నందు Indian Ethos & Human Values చాలా ముఖ్యమైనట్టివి. నీతి నిజాయి తీలపై ధనము కీర్తి గౌరవములు ఆధారపడియున్నవి. అవినీతి, అసత్యము, అక్రమములు సుఖశాంతులు గాని గౌరవ మర్యాదలనుకాని అందించవు. ఈనాడు Business Communications మితిమీరి పోతున్నాయి. ఇవి ఒక రకమైన హానిని కూడా కలిగిస్తున్నాయి. దేశంలో ఒక మారుమూల సమ్మె జరుగుతే క్షణకాలంలో ప్రాకి పోయి వివిధ ప్రదేశాలలో అల్లర్లు జరుగుతున్నాయి. కమ్యూనికేషన్స్ వలన మంచి కంటే చెడ్డ ఎక్కువగా జరుగుతున్నది.

M. M. M.

భారతదేశంలో M. B. A. కాదు కావాల్సింది. Man Management అవసరం. అప్పుడు మానవత్వము అభివృద్ధి యగును. అందుచేతనే Perfect Study of Mankind is man అన్నారు. అనగా మానవుని క్రియలు, ఆలోచనలు, మాటలు-వీనియొక్క ఏకత్వము. ఇవి ప్రధానమైన గుణములు. మానవుడు వీనిని ఆశించాలి. గోడలపై వ్రాతలు కాని, ప్లాట్ ఫారంపై కోతలు కాని, పత్రికలలోని గ్యాస్ గాని ప్రధానం కాదు. నీతి నిజాయి తీలు ముఖ్యం. ఇట్టి Management సంస్కృతిపై ఆధారపడింది. Production Management, Individual Man Management, Accounts Management, Personal & Finance Management, Indian Ethos బోధించాలి. వీటితో Indian Ethos & Human Values చెప్పాలి. ప్రపంచమున M. B. A కు అనేక అర్థాలున్నాయి. Master of Business Management అంటున్నారు. కొందరు M M. S. అంటు న్నారు. అనగా Master of Management Science. కాని మన Institutes లో M. B. A. పేరు సరియైనది కాదు. మనదాంట్లో అంతా M. M. M. అనగా Master of Management Man. దీనివలన కీర్తి జగద్వ్యాప్తి పొంది విద్యార్థులు లోకానికి ఉపకారం చేయగలుగుతారు. నేడు 200 దేశాలలో Management ఉన్నది. విద్యా ర్థులు దేనిని గురించైనా అడగండి చెప్తాను. స్వామికి ఆధ్యాత్మికతే గాని M. B. A. ఎటా తెలుసను కుంటున్నారేమో ! Sai is Awareness. అన్ని తెలి సినది Divinity. ఇన్ని దేశాలవారు నా దగ్గరకు వస్తు న్నారు. వారంతా ఆలోచన లేనివారా ? Indian Ethos & Human Values ను గురించి అరటిపండు వొలిచి నట్లు నేను మీకు ప్రతి ఆదివారం చెప్తాను. నైతిక ధార్మిక ఆధ్యాత్మికములు సరియైన విధానములో నడవాలి. కేవలము నైతికమార్గం చాలదు. దీనికి ఆధ్యాత్మికం చేర్చాలి. దీనికి ఉదాహరణ. Mike చక్కటి Condition లో ఉన్నది. కాని నిరుపయోగం. దీనికి Current ఉండాలి. Corrent ఉండినప్పటికీ Mike Conditionలో ఉన్ననూ నిరుపయోగమే అవుతుంది. కనుక Positive మరియు Negative రెండునూ చేర్చినప్పుడే మైకు పలు కుతుంది. అవియే నైతిక ఆధ్యాత్మికములు.

## మానవత్వం

మానవత్వానికి Balance ఆధారము. అదియే పరిపూర్ణత్వం. అది పోయిననాడు మానవుడు కోతియగును. ఈ Balance ఎందుకు పోయింది. Knowledge అధికంగా ఉన్నప్పటికిని Balance లేదు. ఇది ఎట్లా సాధించాలి. ఈ Knowledge ను అంతా Skill చేసినప్పుడు Balance ఉంటుంది. కాని విద్యార్థులు Knowledge ని Kill చేస్తున్నారు. Kill అనగా పిచ్చిమార్గాలు పట్టించటం. అందువలన స్వార్థ స్వప్రయోజనములు ప్రవేశిస్తున్నవి. వ్యర్థ ప్రయోగాలు కొన్ని కొందరు చేస్తుంటారు. నవ సమాజమని, విశాల సమాజమని వల్లె వేస్తుంటారు. 'మీరు', 'నాది' అనుభావము తగ్గి 'మనది', 'మనవారు' ప్రవేశించాలి. మానవత్వము 'I' నుండి ప్రారంభము అయి 'We' తో End కావాలి. 'I'. 'I' అనునది ఉన్నప్పుడు చివరకు ఈ 'I' కూడా పోతుంది. 'We' భావము లేకున్న జీవితము వ్యర్థము. అందరూ ఒక్కటే యను భావము సమసమాజము, నవసమాజము. సమాజమని అంటూ ఈనాడు ఒకరినొకరు చంపుకుంటున్నారు. పరస్పర సహాయము, రక్షణ, సానుభూతి సమసమాజ లక్షణాలు. ఇవి ప్రార్థనద్వారా మాత్రమే లభించునటువంటిది. దీనిని సాధించడం మన లక్ష్యము. ●

(ప్రశాంతినిలయంలో ది. 22-8-86వ తేదీన M. B. A. తరగతులను ప్రారంభించుతూ జ్యోతిని వెలిగించి శ్రీ సత్యసాయిబాబాగారు చేసిన ఉపన్యాసము.)



# దేవీ నవరాత్రులు

కె. వై. యల్. నరసింహం

దేవీ భాగవతము విశిష్టమైన పురాణము. పురాణము అనగా - పురా అపినవమ్ - ఎప్పుడును క్రొత్తగ నుండునది. 'పురా' అను అవ్యయమునకు - పూర్వము అను అర్థముతో పాటు - ముందు - అను అర్థముకూడ గలదు. అందుచేత - పురాణం - అనగా ఇక ముందుండు నది అని అర్థము. పురాణములు సృష్టికి పూర్వపు స్థితిలో నారంభించి రాబోవు విషయములను గూడ తెలుపుచుండుట అన్ని పురాణములందును గలదు. దీనికి తగినట్లుగా పురాణ లక్షణమిట్లు చెప్పబడినది.

శ్లో॥ సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వన్తరాణిచ।
హమ్యాదే శ్చైవ సంస్థావం పురాణం
పంచ లక్షణమ్ ॥

1. సర్గము-సృష్టి - పరమాత్మయొక్క మాయావిలాసము చేత అవ్యాకృతతత్వము - దానినుండి మహత్తత్వము- దానినుండి అహంకారము దానినుండి సూక్ష్మ భూతములు జనించుట.
2. ప్రతిసర్గము - హిరణ్యగర్భుడు అను ప్రథమ జీవుని యొక్క మానస పుత్రులైన మరీచ్యాది ప్రజాపతుల వలన జరిగిన చరాచర భూతసృష్టి.
3. వంశము : ప్రజాపతులనుండి సృష్టి క్రమములో సాగిన ఆయా ఋషుల రాజుల వంశములు.
4. మన్వంతరములు - స్వాయం భువాది మనువులు .. వారివారి పాలనలోగల విషయములు-ఆయా మన్వంతరములలోని సప్తర్షులు - ప్రధాన మునులు - మొదలగు వారిని గూర్చిన విషయముల ప్రతిపాదనము.
5. భూమ్యాది సంస్థానము .. భూగోళవిభాగము - ఆయా వర్షములలోని ఖండములలోని ప్రధాన పర్వత సముద్ర నద్యాదికము - భారత వర్షములోని నదీ పర్వత సముద్రాది వర్ణనములు - తీర్థములు - క్షేత్రములు మొదలగువాని మహత్త్వ ప్రతిపాదనము అవతార వృత్తాంతములు.

ఈ లక్షణములన్నింటికి దగియున్నది, దేవీభాగవతము.

శ్లో॥ పురాణ న్యాయ మీమాంసా ధర్మ శాస్త్రాంగ
వేదాఃస్థానా నివిద్యానాం ధర్మస్యచ
చతుర్దశ ॥

అని చతుర్దశ విద్యాస్థానములలో - పురాణమొకటిగా చెప్పబడినది. వేదార్థ నిర్ణయమున కుపకరించునది పురాణము. ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థములను అనేకములైన ఉపాఖ్యానముల ద్వారా ప్రతిపాదించుటయే పురాణములందలి వైశిష్ట్యము. అట్టి పురాణములలో భాగవతమునకు గల స్థానము అత్యన్త విశిష్టమైనది అది విష్ణు భాగవతము దేవీ భాగవతము అని రెండు విధములుగా నున్నది. ఈ రెండును పురాణలక్షణ లక్షితములై యున్నవి.

దేవీ భాగవతమునందు - 12 స్కంధములు గలవు. 332 అధ్యాయములు గలవు. 18000 శ్లోకములు గలవు.

మహా పురాణములన్నియు శివుని గాని విష్ణునిగాని పరమ దైవతముగ ప్రతిపాదించుచున్నవి. దేవీ భాగవతము మాత్రము శ్రీ శక్తి తత్వమును పరమార్థతత్వముగ ప్రతిపాదించుచున్నది. శక్తి తత్వము పరమాత్మ తత్వముతో అవిభాజ్యమైన ఇచ్ఛా శక్తి రూపమైనది. కావున శివకేశవుల భేద భావమునకు ఏమాత్రము ఆస్పదము కాని పరమాత్మ తత్వమే దేవీ భాగవతములో ప్రతిపాదన చేయబడినది.

" అష్టాదశ పురాణానాం కర్తా సత్యవతీ సుతః "

వేదవ్యాసమహాముని, శ్రీకృష్ణ ద్వైపాయనుడు అని ప్రసిద్ధి చెందిన అష్టాదశ పురాణకర్త 18 పురాణములను రచించిన మొట్టమొదటి విద్యాపీఠము శ్రీ బదరికాశ్రమము. అచ్చట మొదటి గురు శిష్యులు ధర్ముని పుత్రులగు శ్రీ నరనారాయణులు. ఆ విషయమును స్ఫురింపజేయుటకే, వ్యాసమహర్షి-పురాణముల యారంభమునందు

శ్లో॥ నారాయణం నమస్కృత్య
నరంచైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం చైవ
తతో జయము దీరయేత్ ॥

నరోత్తములగు నరనారాయణులను, శ్రీ సరస్వతీ దేవిని నమస్కరించియే జయమనుపేర వ్యాసులవారు రచించిన పురాణేతిహాసములను ప్రవచింప వలెను.

శ్రీ దేవీ భాగవతము నందు మహా పురాణ లక్షణము లెక్కడ ఏ విధముగా ప్రతిపాదింప బడినదను అంశము దేవీ భాగవతములోని ప్రథమస్కంథము నందు విశదీకరింప బడినది,

భగవతికి సంబంధించిన తత్వమును బోధించిన దగుటచే యిది భాగవతము. ఆ భగవతి ఆదిమధ్యాంతములు లేనిది.

అట్టి మహిమాన్వితమైన దేవీ భాగవతమును – నవరాత్రులలో పారాయణము చేయుట ప్రసిద్ధి.. దేవీ నవరాత్రులు – అశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలుకొని, తొమ్మిదిరోజులు జరుపుకుంటారు. స్త్రీ రూపమంతయు శక్తి స్వరూపమే ! లలిత – కాళీ – చండికా – మహేశ్వరీ – వారాహీ – రాజరాజేశ్వరీ – సరస్వతీ – వైష్ణవీ – దుర్గా – భార్గవీ – ఇవన్నియూ శక్తి స్వరూపములే. ఆమెయే మహిషాసుర మర్దని. ఈ శక్తినుపాసించువారు నవరాత్రులలో కలశమున శక్తి నాహ్వానించి ఉపాసింప వలెను. ఈ నవరాత్రులలో – శక్తిగా భావనచేసి, సుహాసినీ పూజ సలుపవలెను. కుమారీ పూజలు సలుపవలెను. కుంకుమార్చన అతి ముఖ్యము. ఎనిమిదవరోజు దుర్గాష్టమి. ఆనాడు సరస్వతీపూజ సలుపవలయును. విద్యార్థులకు ఈరోజు మిక్కిలి ప్రధానము. తొమ్మిదవరోజు మహానవమి. ఆరోజుతో దేవీపూజ సమాప్తి నొందగలదు. పదవ దినము విజయదశమి ఆనాడు శమీపూజ సల్పుదురు. శమీ యనగా జమ్మిచెట్టు. అందు విద్యుచ్ఛక్తి అధికము. యజ్ఞములలో జమ్మిని మధించి, అగ్నినుత్పాదన చేసి, ఆ యగ్నితోనే హోమములు నిర్వహింతురు.

విజయదశమి – పాండవులు 12 సంవత్సరములు అరణ్యవాసము పూర్తిగావించి, అజ్ఞాతవాసమునకై విరటుని కొలువుకు బోవుచు, తమ యాయుధములన్నింటిని శవాకారముగ ఒక జమ్మిచెట్టుకు వ్రేలాడగట్టిరి. అవి పాండవులకు మాత్రము ఆయుధములవలె గన్పట్టును. ఇతరులకు మాత్రము శవమువలె గోచరించును. అజ్ఞాతవాసము ముగియు రోజుననే పాండవులను గనుగొనుటకై, కౌరవ సేనయంతయు వచ్చెను. అదే "ఉత్తర గోగ్రహణము". అప్పుడు బృహన్నల రూపములోనున్న అర్జునుడు ఉత్తర కుమారుని సారథిగా జేసికొని, ఆయుధములున్న జమ్మిచెట్టు వద్దకు వచ్చి ఆ వృక్షమును బూజించి, ఆయుధములను గ్రహించి, కౌరవ సేననంతను తానొక్కడే సమ్మోహనాస్త్రముతో మూర్ఛిల్లజేసి, విజయమును పొందినాడు. విజయుడు జయమును పొందిన దశమి గావున – విజయదశమి అని ప్రసిద్ధి. ఆ దినమున దేవాలయములలోని ఉత్సవమూర్తులను దీసికొని పరుగులిడుచు, "పారువేట"కు బోవుదురు. శమీపూజానంతరము

శ్లో॥ శమీ శమయతే పాపం
శమీ శత్రు వినాశినీ ।
అర్జునస్య ధనుర్ధారీ
రామస్య ప్రియదర్శనం ॥

అను శ్లోకమును అందరిచేత పఠింపజేయుదురు.

ఈ శ్లోకమును విజయదశమినాడు తప్పక చదువుకొన వలెను. అట్లు చదువుకొన్నవారికి ఆ సంవత్సరము విజయము నిశ్చయమని శాస్త్రము.

శ్రీరామచంద్రుడు రావణునితో యుద్ధమునకు బోయిన రోజుకూడా ఈ విజయదశమి యని విజ్ఞులభిప్రాయపడుచున్నారు. నూతన కార్యములు ఈ దినమున ప్రారంభించుట యుక్తము. బాలురకు అక్షరాభ్యాసము ఈ దినమున చేయుట ఆచారము. సంగీత విద్యాభ్యాసము కూడ ఈ దినమున జేయుట వరిపాటి. మహిషాసుర మర్దనము 'మైసూరు' రాష్ట్రములో జరిగినందున ఆ రాష్ట్రమంతట ఈ 'దసరా మహోత్సవములు' లు అత్యంత వైభవముగా జరుగును. 

# పూలు తగలపెట్టొద్దు

వాణీ రంగారావు

**చుట్టూ చీకటి. మునిమాపు వేళ వెలుగులు నిష్క్రమిస్తున్నాయి. తన జీవితంలో చీకట్లు అలుముకున్నాయి.**

పల్లవి మనసులో వెలుగుచీకట్లు పోరాడుతున్నాయి. ఆరుబయట మంచంమీద ఒక్కర్తీ పడుకుని చుక్కలవేపు చూస్తున్నది. విడివిడిగా ఒక్కొక్క చుక్కా ఒంటరిదే.

ఆదే చంద్రుడితో కలిస్తే ... పల్లవికి నవ్వొచ్చింది. ఇవేం ఆలోచనలు ! కవిలాగా, రచయితలాగా ! అవునుమరి తన జీవితమే మహాకావ్యం. నవరసాలొలికించు నగరంలో ఉండే తను అమాంతం జారి శోకాలలోకం నడిమధ్యన పడింది.

ముసాఫిర్‌తో తన జీవితం నిత్య వసంతమనే అనుకుంది. బి. ఇడి చేస్తున్న తనను ఎం. ఇడి చేసి లెక్చెరర్‌గా స్థిరపడిన ముసాఫిర్, " నన్ను పెళ్ళి చేసుకోడానికి మీకు ఇష్టమైతే మనం పెళ్ళి చేసుకుందాము. " అన్నప్పుడు ఎగిరి గంతేయలేదు. ఆరు నెలలు పరిశీలించింది, స్నేహం కాని స్నేహంలో అతని వ్యక్తిత్వాన్ని చదివింది ఈ ఆరు నెలల్లోనూ ఎన్నో సంఘటనలు. తన కొలీగ్ కమలిని ఉరేసుకుని చనిపోయినప్పుడు, పైగా ఆ అమ్మాయి ఒక మగవాడి మోసానికి గురై గర్భవతిగా ఈ లోకం మొహం చూడలేక ఆత్మహత్య చేసుకుందని తెలిసి, " పిచ్చిపిల్ల కాకపోతే మరొకరి మోసానికి గురై తెలివితక్కువ వాళ్ళమై పోయామే ఆ మోసానికి విరుగుడు చూసుకుని ఛాలెంజిగా బ్రతకాలి, అన్న ధీమా ఉండాలిగానీ, మాములు ఆడిపిల్లకన్నా హీనంగా ఆత్మహత్య చేసుకోవడమేమిటి ? " అన్న ముసాఫిర్ –

తన అన్నగారు అర్ధంతరంగా చచ్చిపోతే ఆ కుటుంబ బాధ్యత అంతా నెత్తినేసుకుని తనకు తండ్రినుంచి సంక్రమించే ఆస్తినంతా నీ ఆ కుటుంబానికే వదిలేసిన ముసాఫిర్, తన జీవితంలో వందరూపాయలు ఏ రూపేణా అయినా అవసరంతో ఉన్నవాడికి వినియోగించే ముసాఫిర్ – ఇంకా ఎన్నో గుణాలు – అన్నింటినీ మించి భ్రమల్లో ముంచెత్తే ప్రేమ కబుర్లతో ఆకర్షించాలని ప్రయత్నించక ఒక బాధ్యతాయుతమైన ప్రయత్నం – " మీకు నన్ను చేసుకోడానికి అభ్యంతరమేదైనా ఉందా ! " అంటూ ముందుకొచ్చిన ముసాఫిర్ తనకు సరయిన తోడు అనే నమ్మకంతోనే జీవితం అతనితో పంచుకుందామనే నిర్ణయానికి వచ్చింది.

ఫస్టు తారీఖు రాగానే " నీ జీతం ఏదీ " అని నోటితో అడగకుండానే అవసరాలు తెలిసేట్లు చేసి తన డబ్బంతా లాగేసే వదినగార్ని అన్నీ తెలిసే ఏమీ తెలియనట్లు నటించే అన్నగార్ని మనసులో ఓ మూలకు నెట్టేసి, ముసాఫిర్ చేయి పట్టుకుని అనంతమైన ఈ లోకంలోకి ధైర్యంగా అడుగు పెట్టింది. ఏడడుగులు కాదు కొన్ని వేల యోజనాల దూరం, అంతరంగికంగా ప్రయాణం చేసింది.

బి. ఇడి చేస్తున్నప్పుడు పరిచయమైన ముసాఫిర్ ఉద్యోగం వచ్చిన నాలుగైదు నెలలకు గాని తన నిర్ణయం తెలియచేయకపోయినా అతని ప్రవర్తనలో ఏ విధమైన

మార్పు లేదు. ఒక్కోసారి నోరు తెరిచి తనవారి ప్రవర్తనలూ, ఆర్థిక ప్రలోభాలు చెప్పినా ఓ చిన్న నవ్వు నవ్వి, " ఆర్థిక సమాజం పల్లవీ ! ఈ స్థితిలో మీవాళ్లే కాదు ఎవరైనా అలాగే ప్రవర్తిస్తారు. నిన్ను చదివించారు. నువ్విప్పుడు ఉద్యోగం చేస్తున్నావు. నీ సంపాదన ప్రతి రూపాయికీ పెట్టుబడి తమదేనన్న భావన మీవాళ్ళందరి మీదా ఉంటుంది. అలాంటప్పుడు వాళ్ళు నీ సంపాదన ఆశించడంలో తప్పు లేదు. దాన్ని గురించి నీవు తీవ్రంగా ఆలోచించి మనసు పాడు చేసుకోకు. " అన్న ముసాఫిర్ **తన బతుకులో అతనిది పెద్ద స్థానం.**

పల్లవి గుండెల్లో జ్ఞాపకాలు, తెరలు తెరలుగా . ఇంత హఠాత్తుగా ఒంటరిదై పోయిందేం తను! ఎన్నడూ దేవుణ్ణి తలచుకోనైనా తలచుకోని తను ఇలా నిస్సహాయంగా బతుకు కడలిన చిన్ని తెప్పలాగా ! ఏమిటీ స్థితి ? ఎవరినీ లెక్క చేయక నాకీ కొండలాంటి అండ ఉంది అనుకున్నందుకు నిలుచున్న భూమి లోపల డొల్లయిపోయి కుంగుతున్నట్లు, నిర్భయంగా ఈ జనారణ్యంలో నిశ్చింతగా ఉండగలను అనుకున్నందుకు ఈ భయంకరాటవి మధ్య ఈ క్రూర మృగాలవంటి మనుషుల మధ్య ఒక్కదాన్ని వదిలేసి....

పల్లవి గుండెల్లో గతం నర్తిస్తోంది. విషాదం చివరి అంచుల్లో దుఃఖం గడ్డ కట్టుకపోయి పల్లవి కళ్ళు తడి ఆరిపోయి చివరి వెలుగు స్రవిస్తున్న దీపాల్లా -

" పల్లవిగారూ ! పల్లవిగారూ " రవి పిలుపు ఎక్కడో ఉన్న పల్లవి ఆలోచనను లోకంలోకి తెచ్చింది.

" రండి. రండి "

"వచ్చేశానండీ. ఏవిటలా ఒక్కరే కూర్చున్నారు? " రవి

" ఒక్కదాన్నా .... " నవ్వింది పల్లవి. ఆ నవ్వులో విషాదం - పెదవులపై లాస్యం-కళ్ళలో శోకం - చీకటి.

" పల్లవిగారూ ! అబ్బ ఏంటండీ అంత డల్‌గా - పాకీజా పిక్చరొచ్చింది. పోదాం లేవండి. " అన్నాడు రవి. ఎలాగైనా పల్లవి మనసులో విషాదాన్ని వెళ్ళగొట్టాలని. పాకీజా పేరే ముసాఫిర్ జ్ఞాపకాలు ముసురుకుంటాయి పల్లవిని.

" పల్లవీ ! పాకీజా అంటే ఏవిటో తెలుసా ! అతి పవిత్రమైనదీ అని అర్థం. మీనాకుమారి కళా విలువకు పరాకాష్ఠ ఆ సినిమా. ఆమె గులాబీ రంగు పాదాల సౌందర్యం - డైరెక్టర్ కమాల్ అమ్రోహీ హృదయం కనిపిస్తుంది పల్లవీ ! ఎంత గొప్పగా తీశాడనుకున్నావ్ - ఆమె పాదాల దగ్గర తన హృదయాన్ని పరుస్తాడు రాజ్‌కుమార్. రాజ్‌కుమార్ -అశోక్‌కుమార్ -మీనాకుమారి - కమాల్ అమ్రోహీ .... " అంటూ చెప్పుకు పోతుంటే .

" అబ్బ పాకీజా పేరెత్తితే మీకు ఒళ్ళూపాయీ తెలీదండీ. " అనేది తను.

" అవును పల్లవీ ! ఆ సినిమాలో ప్రతి సన్నివేశమూ ప్రతి పాటా, ప్రతి మాటా నా గుండెల్లో భద్రంగా ఉంటాయి. " ముఝెకోయీ మిల్‌గయా థా " ట- పల్లవీ ! ముఝె మిల్‌గయా తుమ్ - ఏక కలీ ముస్కురాతా - నవ్వే చిరుమొగ్గ నడచి వచ్చి నా కౌగిట వాలింది. పల్లవీ నా జీవన రాగానికీ గానానికీ నువ్వు పల్లవి." పల్లవీ పల్లవీ అంటూ వలవరించే ముసాఫిర్....

" మళ్ళీ ఎక్కడికో వెళ్ళిపోయారు. రండి .... దిగిరండి. పల్లవిగారూ పోనీ తుమ్మలపల్లి వారి ఆడిటోరియంలో చిట్టిబాబు వీణ. దానికి పోదాం లేవండి. " పల్లవి ఎదలో గూడు కట్టుకున్న దుఃఖం కరిగి పోతూంది. కన్నీరై ఉప్పొంగుతూంది.

రెండు చేతుల్లో మొహం దాచుకుని, వద్దండీ వద్దు. నాకవేమీ వద్దు. అన్నింటిలోనూ నా ముసాఫిర్ స్మృతులే. పక్క ఊళ్ళో శోభానాయుడు డాన్సయితే నాతో సహా వెళ్ళిపోవాలి. తన ఆర్థిక స్థితి పర్మిట్ చెయ్యాలే గానీ లోకంలో ఉన్న ఆనందాన్నంతా నా కందివ్వాలనే ఆయన తపన తీరకుండానే బతుకులు తెల్లవారి పోయాయి. వద్దండీ నాకే ఆనందాలూ వద్దు ఈ వెలుతురూ వద్దు. " కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్న పల్లవిని ఎలా ఓదార్చాలో అర్థం కావడం లేదు.

" పల్లవిగారూ ! మీరిలా కుంగిపోతే ముసాఫిర్ ఆత్మ శాంతించదు. అతను ఎంత భావుకుడో ఎంత ప్రేమికుడో అంత కర్మవాది. ఎంతమంది జీవితాల్లో అతని జోక్యం ఉందో ! నాశనమై పోవలసిన వాళ్ళెంత మంది అతని మూలాన మళ్ళా ఊపిరి పీల్చుకున్నారో ! మీకు తెలీదా ! అలాంటి వాడితో మీ సాన్నిహిత్యం మిమ్మల్ని ఆత్మధైర్యంతో విశ్వాసంతో నిలబెట్టాల్సింది పోయి మీరిలా .... "

దోసిట దాచుకున్న మొహాన్ని రవికి చూపించడానికి బాధగానూ ఉంది. కాని ఎలా .... ఎలా .... " రవిగారూ ! మర్చిపోలేక పోతున్నానండీ. ప్రతి గడియా ప్రతి క్షణం ఎంతో గొప్ప అనుభూతుల్ని మిగిల్చి పోయింది. నేను ముసాఫిర్‌ని పల్లవీ ! నాకు అవకాశమే లేదు గానీ రాహుల్‌జీ (సాంకృత్యాయన్) లాగా మహా యాత్రికుణ్ణి కావాలని ఉంది అనేవాడు. యాత్రికుడిలాగానే నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు. తను స్కూటర్ కొన్నప్పుడు ఎందుకో అన్నాను. వద్దండీ అని. సిల్లీ సెంటిమెంట్సంటూ కొట్టేశాడు. అయినా అంత నిబ్బరంగా క్రమబద్ధంగా ఉండే మనిషి ప్రమాదం పాలవుతాడని ఎప్పుడూ అనుకోలేదండీ. " బావురుమంది పల్లవి.

దుఃఖం మనిషిని వశపర్చుకున్నప్పుడు మనసుతీరా కరువుతీరా ఏడ్చేస్తే తరవాత గొప్ప రిలీఫ్, రవి వదిలేశాడు కాస్సేపు.

రవి, ముసాఫిర్ చిన్నప్పటినుండీ స్నేహితులు. రవి మెడికల్ రిప్రజంటేటివ్. ముసాఫిర్ లెక్చెరరు. సెలవలప్పుడు ఇద్దరూ కలిసే ఉండేవాళ్ళు. పల్లవిని పెళ్ళి చేసుకోవాలనే నిర్ణయానికొచ్చేక రవి అన్ని బాధ్యతలూ నెత్తినేసుకుని ఇద్దరినీ కలిపి పెళ్ళికి పెద్దరికం తీసుకున్నాడు.

" పల్లవిగారూ ! మీకు వాడికీ అయిదేళ్ళ సాన్నిహిత్యమేనండీ ! నాకూ వాడికీ ముప్ఫయ్యేళ్ళ స్నేహమండీ. మామూలు స్నేహంకాదు పల్లవిగారూ భార్యాభర్తల



అనుబంధంకంటే గొప్పది. అయినా మన చేతుల్లో లేనిది మనం ఏం చేయగలం చెప్పండి. మీరిలా కుంగిపోతుంటే నేనూ .... నేనూ తట్టుకోలేక పోతున్నాను. " తల దించుకుని దుఃఖోద్విగ్నతను నిభాయించుకోడానికి ప్రయత్నిస్తున్న రవిని చూసి పల్లవికి తన తప్పు తెలిసింది. ఇలా దిగజారి పోవడం వల్ల తనకేగాదు ఎంతో వృద్ధిలోకి రావాల్సిన రవి కూడా దిగజారిపోతున్నాడు. ఇప్పటికే మిగతా కార్యక్రమాలన్నీ మానుకుని తనకోసం తన దగ్గరే గడుపుతున్నాడు. రవికి కష్టం కలిగించ కూడదు, అనుకుంది పల్లవి.

" లీవ్ ఇట్ రవిగారూ ! పదండి చిట్టిబాబుగారి వీణ అంటే అపరిమితమయిన ఇష్టం నాకు. వెళ్దాం పదండి. " అలముకున్న విషాదచ్ఛాయల్ని బలవంతంగా పారగొట్టి నవ్వు పులుముకుంటూ లేచింది పల్లవి.

పొడుగ్గా ఉన్న జడ నాట్యం చేస్తూంది. తెల్లచీరలో సౌందర్యం స్నిగ్ధంగా కమనీయంగా ఉంది. ఇంత చక్కదనం చీకట్లపాలు అనుకుంటే రవి గుండె ఏచ్చిపోతూంది.

## జె. పి.

నేతాజీ మంటల్లో పెరిగి
గాంధీజీ వెన్నెల్లో కరిగి
పట్టుకున్న నెహ్రూ చేయి విదిలించుకొని
సర్వోదయ త్యాగ శాద్వలాలమీద విహరించి
భూదానోద్యమ యజ్ఞం నిర్వహించి
తిరిగి ఉష్ణరక్త కాసారంలోకి దుమికి
అక్రమ రాజకీయాల నెదిరించి
సంపూర్ణ విప్లవాగ్ని వర్షం కురిపించి
ఒక్క చైతన్యపు మొక్కకూడా తలెత్తక
పోవడం చూసి
నిరుత్సాహంతో కన్ను మూసిన
పరాజిత భావాల బెటాలియన్ !
బ్యాడ్‌లక్ వాటర్‌లూ నెపోలియన్ !!

—డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు

ఆటోలో చిట్టిబాబు వీణ వినడానికి వెళ్ళారు.

పల్లవి అయినవాళ్ళందరినీ ఎదిరించి ముసాఫిర్‌ని చేసుకుంది. "పేరు మార్చుకోనా ! ముస్లింపేరు పెట్టుకోనా !" అని అడిగిన భార్యను, "ఎందుకు పల్లవీ ! ఎవరినో తృప్తి పరచవలసిన అవసరం మనకెందుకు ?" అంటూ అక్కున చేర్చుకున్న ముసాఫిర్ ఎవరి ఆమోదం కోసమూ ఎదురుచూడక తనకు నచ్చిన మార్గంలోనే సాగిపోయాడు.

ముసాఫిర్ మరణం తరవాత ఉద్యోగస్తురాలయిన ఆడపడుచుని ఆదుకోవాలనిపించింది పల్లవి వదినగారికి. సకుటుంబ సమేతంగా పల్లవి దగ్గిరకి చేరారు.

"అన్నయ్య ఒక్కడూ అక్కడ ఎలా ఉంటాడు వదినా ! భోజనమదీ కష్టం గదా !" అన్న పల్లవికి—

"అదేవన్నమాట తల్లీ ! ఇంటి ఆడపిల్ల ఇంత కష్టంలో ఉంటే అక్కడ మేము కులుకుతూ కూర్చోడం సాధ్యమయ్యే పనేటమ్మా ! మీ అన్నయ్యకి చేతులు కాల్చుకోడం అలవాటేగా ! అయినా తప్పేదేవుంది ?" అంటూ ఎదురు ఓదార్పులు —

పల్లవి మౌనంగా అంతా భరిస్తోంది. పిల్లల్ని కూడా అన్నగారి ఊరినించి మార్చి విజయవాడలోనే స్కూళ్ళల్లో చేర్పించే ఏర్పాట్లు చూస్తుంటే పల్లవికి భయంగానూ ఉంది. కాదనీ అనలేకపోతూంది.

పల్లవి కచేరీకి వెళ్ళిందే కాని గతస్మృతులూ వర్తమాన సంఘటనలూ మనసులో కంగాళీ చేస్తున్నాయి.

"రవిగారూ ! వదినావాళ్ళు వెళ్ళేట్లు లేరండీ. పిల్లల్ని కూడా ఇక్కడే సెటిల్ చేసేట్లుందావిడ."

"అది అంత మంచిపని కాదనిపిస్తోందండీ దూరంగా ఉంటేనే గౌరవాభిమానాలు ఉంటాయి. దగ్గరకొస్తే బాధ్యతలు మర్చిపోయి హక్కులు ఫీలయ్యే ప్రమాదం ఉంది. ముందు ముందు మీ ప్రతి నిర్ణయం మీదా వాళ్ల చెకింగ్ పెట్తారు. తరవాత కలతలూ కావేషాలూ." అన్నాడు రవి. ముసాఫిర్ బ్రతికి ఉండగా కుటుంబ పరిస్థితులన్నీ చర్చించుకునేవారు. రవికి అందరి గుణాలూ తెలుసు.

తను రవితో బయటకు వచ్చేటప్పుడు వదినగారు చూసిన చూపు గుర్తొచ్చింది. తను పెద్దగా పట్టించుకోవడంలేదు గానీ ఈ ఆరు నెలల్లోనూ వదినెగారి ప్రవర్తనలో వస్తున్న మార్పులు చాల నీచస్థాయికి పోతున్నట్లున్నాయి. పిల్లల్లోనూ ఆ మార్పు కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది.

పూలవాడొచ్చాడు నాలుగు రూపాయలివ్వత్తా అన్న మేనకోడలికి చిల్లర లేదమ్మా అని సమాధానం చెప్తే పూల విలువ నీకేం తెలుసులే అంటూ వెళ్ళిపోయిన సందర్భాలు గుర్తొచ్చాయి. రవి చెప్పింది అక్షరాలా నిజమే ననిపించింది. ఎలాగైనా ఈ విషయంలో స్థిర నిర్ణయం చెయ్యాలి అనుకుంది. (సశేషం)

# ఆవిరి స్నానం

యస్. యన్. దుర్గారావు

ఈ ఆవిరి స్నానం ఆరోగ్యానికి చాలా అవసరం. ఈ ఆవిరి స్నానానికి మన దేశంలో పెద్దగా ప్రాముఖ్యం లేదుగానీ ఇతర దేశాలలో దీని అవసరాన్ని తెలుసుకొని రకరకాలుగా ఆచరిస్తున్నారు. రష్యా, జపాన్, టర్కీ, ఫిన్లాండ్, ఫిన్నిష్ మొదలైన దేశాలలో ఒకో రీతిగా ఈ ఆవిరి స్నానమును చేస్తున్నారు. ఉదాహరణకు ఫిన్లాండ్ దేశస్తులు రాతి పలకలను ఒకదానిపై ఒకటి తయారు చేసి బాగా కాల్చి, కాల్చుతుండగా చల్లని నీరు పోస్తే వచ్చే ఆవిరిలో స్నానం చేస్తారు. ఇదంతా ఓ గదిలో జరుగుతుంది. ఇలా ఈ చికిత్స పూర్తవ్వగానే ఏ కాలవలోకో, నదిలోకో, లేక చన్నీళ్ళ స్నానమో చేస్తారు.

జపాన్ వంటి దేశాలు పెద్ద పెద్ద గదులలోకి గొట్టాలు అమర్చి, వాటినుంచి ఆవిరి పంపిస్తుంటారు. అంటే మరో గదిలో నీరు మరుగబెట్టి ఆ ఆవిరిని ఇలా గొట్టాల ద్వారా నలు మూలల నుంచి ఒకేసారి వదుల్తారు. లోపల బెంచీలమీద స్వేచ్ఛగా పరుండి సిద్ధంగా ఉంటారు. ఈ ఆవిరి వారిని 5 ని॥లు పాటు ఉక్కిరిబిక్కిరి చేసే విధంగా ఉంటుంది. స్నానం చేసినట్లవుతుంది. పద్ధతులేవైనా మూల సూత్రం ఒక్కటే.

మనమూ ఈ ఆవిరి స్నానం చేయవచ్చు. దీనికోసం గదులూ, పరికరాలు లేకపోయినా క్రింద చెప్పిన విధంగా చేసి ఆవిరి స్నానం వలన కలిగే ఫలితాలను పొందవచ్చు.

ముందుగా పొయ్యిమీద నీరు బాగా మరిగేటట్లు కాచాలి. ఇలా చేసేముందు నీటిలో యూకలిప్టస్ ఆకులు గానీ వావిలి ఆకులుగానీ, వేప ఆకులుగానీ, తులసిఆకులుగానీ, కొంచెం పసుపు పొడిగాని వీటిలో ఏది లభ్యమైతే అది వేసి బాగా మరగనివ్వాలి. తరువాత ముక్కాలి పీటమీద కూర్చుని రెండు కాళ్ళ మధ్యలో మరగించిన పాత్రను పెట్టి తలమీద నుంచి కాలి వరకు దుప్పటి కప్పుకోవాలి. కొంచెం ఇటుక పొడిని కూడ సిద్ధంగా ఉంచుకోవాలి. కొంచెం తల వంచి పాత్ర మీద మూత తీయాలి. ఇలా తీయగానే ఆవిరి మన వంటికి అన్ని వైపులా కమ్ముకుని స్నానం చేసినట్లవుతుంది. ఇలా రెండు ని॥లు ఉన్న పిదప ఆవిరి తగ్గుతున్నదనిపించినపుడు, ఇటుక పొడిని ఆ నీటిలో వేస్తే ఇంకా ఏమైనా ఆవిరి మిగిలిఉంటే అది కూడా పైకి వచ్చేస్తుంది. 5 ని॥లు ఉన్న తరువాత ఆవిరి క్రమంగా తగ్గుతుంది. తరువాత దుప్పటి తీసివేసి వెంటనే చన్నీళ్ళ స్నానమాచరించాలి. ఈ ఆవిరి స్నానం చేస్తే హాయి కలిగి సుఖ నిద్ర పడుతుంది.




ఈ ఆవిరి సాన్నం వలన జలుబు, తల నొప్పి, వంట్లో నలపరం, వాత, కీళ్ళ నొప్పులు నమసి పోతాయి. ఉత్సాహాన్నిస్తుంది, సుఖ నిద్ర పట్టిస్తుంది.

ఆవిరి స్నానం చేసిన వెంటనే నీరసంగా ఉన్నట్లుంటుంది గానీ త్వరలో మామూలుగా అయిపోతాం.

ఆవిరి స్నానం వలన ఇన్ని లాభాలున్నాయి కాని తరచూ చేస్తే ఆరోగ్యం అసలుకే దెబ్బ తింటుంది. కాబట్టి ఎప్పుడు మనకు అవసరమో, ఆయా పరిస్థితులబట్టి మనకు చేయాలనిపిస్తే చేసి, పై లాభాలను పొందవచ్చు. ఒక్కసారిగా మనల్ని ఆవిరి ఉక్కిరిబిక్కిరి చేస్తుంది గనుక గుండె జబ్బులు కలవారు ఈ ఆవిరి స్నానం చేయరాదు.



ఆశ్రమవాస పర్వం – 7

# శతయూపుని ఆశ్రమంలో కురురాజు

కురు వృద్ధుడైన ధృతరాష్ట్రుడు అలా నిశ్చింతుడై గాంధారీ, కుంతీ, విదుర సంజయులూ, అగ్నిహోత్రానికి అవసరమైన ఋత్విగ్జనమూ, తనతో వస్తూండగా, గంగా నదీ తీరాన ఒక యోగ్య ప్రదేశాన్ని చేరుకొన్నాడు. స్నానాదికమైన విధుల నన్నింటినీ నిర్వర్తించాడు; అగ్నులకు అర్చనలిచ్చాడు, హోమాన్ని సలిపాడు. తనతో వచ్చిన వారందరికీ ఆహార మందేటట్టు చేశాడు. తానూ భోజనం చేశాడు. విదుర సంజయులు సమకూర్చిన దర్భ శయ్యను చేరాడు. అతనికి కొంచెం దూరంలో గాంధారీ, ఆమెకు దగ్గరగా కుంతీ, పరిసరంలో విదుర సంజయులూ, యాజక జనం విశ్రమించారు. అలా సాయంకాలం వరకూ విశ్రమించి, ఆమీద సాయంతన కృత్యాలను నిర్వహించారు.

వడలి మందేశ్వరరావు

ఆ రాత్రి అక్కడే గడిపారు. మరునాడు ధృతరాష్ట్రుడు తన వారందరితో గంగానదిని దాటి కురుక్షేత్రాన్ని ప్రవేశించాడు. అక్కడొక పుణ్యాశ్రమానికి సమీపాన చెట్ల నీడన, చల్లటి తావున ఆసీనుడయ్యాడు.

ఆ ఆశ్రమం కేకయ వంశానికి చెందిన శతయూప రాజర్షిది. ఆంబికేయు డక్కడకు రావడాన్ని ఆ రాజర్షి విన్నాడు. స్వయంగా వచ్చి ధృతరాష్ట్రుని తన ఆశ్రమానికి తోడ్కొని వెళ్ళాడు. అర్ఘ్యాది విధుల్ని ఎంతో వినయంతో నడిపి ఇక్కడే ఉండమని ధృతరాష్ట్రుణ్ణి కోరాడు. ధృతరాష్ట్రుని అనుమతిని విదురాదులు సమీపంలో పర్ణశాలను నిర్మించారు. అక్కడ ఆ కురువృద్ధు తానూ, గాంధారీ సువ్రత పరులై, కుంతీ విదుర సంజయులతో తపస్సు చేయ పూనుకున్నాడు. అక్కడి మునులకు ఆతని తీవ్రమైన తపశ్చర్య ఆశ్చర్యాన్ని కల్గించింది. ఆతని శరీరం నిర్మాంసమైపోయి, పట్టి చర్మాస్థులే మిగిలాయి.

ఇలా ఉండగా ఒకనాడు నారద పర్వత దేవల మౌంజాయలనే మునులు ధృతరాష్ట్రుణ్ణి చూడడానికి ఆ ఆశ్రమానికి వచ్చారు. మహా మునులు వచ్చారని శతయూపుడు కూడా అక్కడకు వచ్చాడు. వారందరినీ కుంతి వినయంతో సమర్చితులుగ చేసింది. వారు ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళగా, ఆతడు వారికి ఉచితమైన దర్భాసనాలను పెట్టించి, వినతుడయాడు. మునులూ కురుపతిని దీవించారు.

మాటల్లో ధృతరాష్ట్రునితో నారదుడు, “ ఈ శతయూపుని తాత సహస్రచిత్తు డిక్కడే తపస్సు చేసి ఉత్తమ లోకాలను పొందాడు. అలాగే వృషధ్రుడు, శైలాలయుడూ, పురుకుత్సుడూ కూడా ఇక్కడే తపస్సు చేసి ఇంద్ర లోకాన్ని చేరుకున్నారు. ఇది అందరికీ దొరికే చోటు కాదు. నీకు కృష్ణద్వైపాయనుని ప్రసాదం వల్ల ఇక్కడ వసించే అవకాశం కలిగింది. ఓ రాజా ! నీవు కూడా ఇక్కడి నీ తపస్సువల్ల విశిష్ట పదాన్ని పొందుతావు. గాంధారీ నిన్ననుసరించి వస్తుంది. మీ కింత భక్తితో శుశ్రూష చేసే కుంతి కూడా పతిని చేరుకుంటుంది. ఆ పాండురాజు దేవేంద్రుని సమీపాన ఉండి ఎప్పుడూ మీ మాట తలుచుకుంటాడయ్యా ! ధర్మమూర్తి అయిన ధర్మరాజు తన ఆత్మ అవడం వల్ల విదురుడాతని శరీరంలో ప్రవేశిస్తాడు. సంజయుడు కూడా స్వర్గలోకాన్ని చేరుకుంటాడు. ” అన్నాడు.

ఈ మాటల్ని విని ఆంబికేయుడు, గాంధారీ, కుంతీ సమేతంగా ఎంతో సంతోషించారు.

శ్రీవాణి

శతయూపుడు మాత్రం నారదుణ్ణి, "ఇంత విస్పష్టంగా మీరు వీరికి సద్గతులు కల్గుతాయన్నారు. ఈ విశేషాన్ని విన గోరుతున్నాను " అని అడిగాడు.

" నేను తరచు మహేంద్రుని దగ్గరకు వెడుతుంటాను కదా ! ఆ సభలో ఈ రాజు మాటలు పుట్టి, ఈతని వృత్తిని, నిష్ఠను వర్ణించారు. అప్పుడు ' ఈ ధృతరాష్ట్రుడు మూండేండ్లు తపస్సు చేసి, తాను గాంధారితో ఈ దేహాన్ని విడిచి వెడతాడు. ఆమీద కుబేరుని చెలిమితో, దివ్యాభరణాలను దాల్చి, విమాన విహారాన్ని సల్పుతూ, హృష్టాత్ముడై ఉంటాడు ' అని ఇంద్రుడు నాతో అన్నాడయ్యా ! "

ఇలా సద్గోష్ఠి జరిపి ఆ మునులు ధృతరాష్ట్రి నభినందించి, తమ నివాసములకు వెళ్లారు.

* * *

ఇక ఇక్కడ పాండవులు తల్లిని తరచు తలచుకొంటుంటారు. ధృతరాష్ట్రుణ్ణి, గాంధారిని గురించీ చింతిస్తుంటారు. " అయ్యో, ధృతరాష్ట్రుడు రాజు, వృద్ధ సుఖాన్ని అనుభవించవలసినవాడు. నిర్జనంగా ఉన్న అడవిలో ఎలా కాలాన్ని వెళ్ళబుచ్చుతున్నాడో ; గాంధారి కుంతి అత్యంత కోమలాంగులు. అడవిలో ఎలా ఉండగలుగుతున్నారో ! అంతటి కొడుకులనూ, రాజ్య సౌఖ్యాన్నీ విడచి ఆ కుంతి భోజుని కూతురు అలా అడవికి వెళ్ళిపోయిందే, పాపం ! తల్లి నెడబాసి, ఈ పాండవు లెంతగా వగస్తున్నారో కదా ! విదురుడూ, సంజయుడూ ధృతరాష్ట్రుని పట్ల భక్తి కలిగి అడవికి వెళ్ళారు కాని, వారూ ఆ అడవిలో ఎంత ఆయాసపడుతున్నారో ! " అని పౌరులు అనుకుంటూంటారు.

పాండవులూ తల్లితో తమకు కల్గిన ఎడబాటుకు దుఃఖపడుతూ ఉంటారు. వారందరూ ఒక్కచో నున్నప్పుడు, ధృతరాష్ట్రుని, గాంధారిని తలచుకొని, వారి కొడుకు లెవ్వరూ వారికి మిగలలేదనీ, అడివిలో ఎలాగున ఉన్నారో అనీ బాధపడుతుంటారు. తల్లి కుంతి ఇంకా ఎన్నాళ్ళు ఇలా అడవిలో ఉంటుంది. బంధువుల నందరినీ

## మోడ్రన్

పిచ్చి గీతలు
నాలుగు గీసి
అదే మోడ్రన్ ఆర్టు
అనుకోకు !
పచ్చి బూతులు
నాలుగు రాసి
అదే సాహిత్యమని
అనుకోకు !

— బయ్యారపు చినమల్లేశ్వరరావు

దయ లేక చంపాము. కాని, స్థిర చిత్తులమై ధైర్యాన్ని వహించి కోపాన్ని అణచుకోలేక పోయాము. అభిమన్యు డెంతటి వీరుడు ! అతణ్ణి, అతని పిన్న తమ్ములనూ, కర్ణునీ కోలుపోయి, ఇలా ఒంటరి బ్రతుకు బ్రతుకుతున్నాము. అని చింతిస్తూంటారు. విదురుని సంజయుని తలచి ' అయ్యో ' ! అనుకుంటుంటారు. ఈ బెంగతో క్రుంగిపోయి, భోగాలనూ, వినోదాలనూ వదలి, రాజ్య సంపద పట్ల విముఖత్వాన్ని వహించి ఉంటారు. ద్రౌపదీ, సుభద్రా కూడా సంతాపాన్ని పొందుతూంటారు.

ఇక వంశాంకురం ఒక్కడు పరీక్షిత్తు ఉన్నాడు. ఆ పసివాణ్ణి చూస్తే, అందరికీ శోకం కాస్త తిరోహితమవుతుంది.

ఇలా పరమ ధీరులైన పాండవులు బెంగ పెట్టుకుని, కురు వృద్ధుని, అంధ నృపతిని చూడాలని ఎవరిమట్టుకు వారు మనసులో అనుకుంటూండగా, ఒకనాడు సహదేవుడు అన్న ధర్మరాజుతో వినయంతో, " నేను ఎంతో కాలాన్నుంచి అనుకుంటున్నాను కాని, చెప్పడానికి ధైర్యం చాలక నీతో అనలేదు. అమ్మ కుంతిని చూడడానికి మనం వెళ్ళడం ధర్మం. ఈ విపిన వాసంతో ఎట్టి దుస్థితిలో

# విజయదశమి పండుగ!

మజా మజా పండుగ
విజయదశమి పండుగ !
ఇంత అంత చెప్పలేని
ఎంతో గొప్ప పండుగ ! ॥మజా॥

బాలలు బాణాలు పట్టి
పంతులతో బయలుదేరి !
పాటలు పద్యాలు పాడి
ప్రతి ఇంటిని మురిపించెడి ! ॥మజా॥

ప్రతి యింటా పెద్దలిచ్చు
పప్పు బెల్లాలు తింటు !
సంతసముతొ పిల్లలంత
గంతులేయుచుండు నట్టి ! ॥మజా॥

బాలలకు చదువు చెప్పు
పంతుళ్ళను గౌరవించి !
దండిగ కట్నాలు యిచ్చి
మెండుగ దీవెనలు పొందు ! ॥మజా॥

పెద్ద పెద్ద వ్యాపారులు
పెను లాభమ్ములు పొందగ !
అమ్మవారి పూజ జరిపి
ఆనందము పొందు నట్టి ! ॥మజా॥

పండుగ లన్నింటిలోను
ప్రముఖమైన పండుగ !
పిన్న పెద్ద లందరికీ
ప్రియము గూర్చు పండుగ ! ॥మజా॥

— కవుల ఆంజనేయశర్మ

ఆమె ఎక్కడ ఎలా ఉన్నదో ! ఆమె ఇంకా ప్రాణాలతోనే ఉంటుంది. బావనూ, అప్పగారినీ సేవిస్తూ ఆ మహానుభావ ఎలా ఉందో ఒక్కసారి చూడాలిగదా ! ధృతరాష్ట్రుడు గాంధారీ అతి సుకుమారులు. నారబట్టలను కట్టుకొని, వ్రత చర్యలతో, కందమూలాలను తింటూ ఏం బాధ పడుతున్నారో ! వారికి మరో దుర్దశ పుట్టకముందే, మనం అక్కడకు వెళ్ళి వారిని చూడడమెంతో అవసరమైన పని! " అన్నాడు.

ఈ మాటల్ని వింటూన్న ద్రౌపది కూడా " అవును, ఎంతో బెంగటిల్లి ఉండిన మనకందరకూ ఈతని మాట ఎంతో ఉచితంగా ఉంది. కుంతి కోడండ్రందరూ ఎప్పుడు వెళ్ళి వాళ్ళను చూద్దామా, అని కాలు గుమ్మాలలో పెట్టుకొని ఉన్నారు " అంది.

వారిద్వరి మాటలను విని " అమ్మా నవనాధుండు కానన గమనంబు నిశ్చయించి " ప్రయాణానికి ఏర్పాట్లను చేయమని సేనాధిపతులకు చెప్పాడు.

* * *

కాగా అక్కడ అడవిలో ధృతరాష్ట్రాదులు అంతిమ దినాలకై ఎదురుచూస్తూ ఉన్నారు. ఐహికమైన బంధాలను ఊడ్చుకోవాలన్నది వారి ప్రయత్నం. వారు పాండవుల మాటను తలపెట్టనే లేదు సరిగదా, ఇంక మూడేండ్లలో విముక్తి కల్గుతున్న దన్న తృప్తితో ఉన్నారు.

మరి ఇక్కడ హస్తినాపురంలో పాండవులకు బెంగ ఉండటం వారి సజ్జనత్వానికే కాకుండా, కురు పాండవ యుద్ధానంతరం వారికి చిత్తశాంతి లేకపోవడం తెలియ చేస్తుంది.

ఇంత చీకటిలో కూడా వాళ్ళకొక కాంతికిరణం కనబడుతోందని, అది వంశాకురమైన పరీక్షితు అని తిక్కన మరచి పోకుండా చెప్పడం, కథలో సుకుమారమైన మానవతాస్పర్శకు తార్కాణం.

( సశేషం )

# అంతా ఒక్కటే

**భారతదేశం,** వివిధ జాతులకీ వివిధ మతాలకీ, వివిధ భాషలకీ వివిధ సంస్కృతులకీ కూడలి. అయితే భారతీయుల మధ్య ఎన్ని భేదాలున్నా వారందరినీ కలిపి ఉంచేది ఒకటుంది. అదే భారతీయ సంస్కృతి. నాకు భారతదేశం అంతా కూడా సమగ్రంగా పర్యటించే మహద్భాగ్యం కలిగింది. ఈ పర్యటనల్లో వివిధ రాష్ట్రాల ప్రజలు చూపించిన ఆప్యాయత, ప్రేమాభిమానాలు చూస్తుంటే, దేశంలో ప్రజలు అందరూ మంచివారేననీ, కేవలం కుటిల చింతనతో స్వార్థపరులు రెచ్చగొట్టే ఆవేశాలవల్ల వారు అప్పుడప్పుడు పరస్పర ద్వేషాలను వెళ్ళగక్కుతారని, నాకు దృఢమైన అభిప్రాయం ఏర్పడింది. మనస్సుని ఎంతగానో అలరించి, మస్తిష్కంలో శాశ్వతమైన ముద్రలను వేసుకున్న అసంఖ్యాకమైన అనుభవాలలో కేవలం రెండింటిని, ఒకటి ఉత్తర భారతదేశానికీ, మరొకటి దక్షిణ భారత దేశానికీ చెందిన వాటిని తెలుపుతాను.

అది 1962 వ సంవత్సరం. ఒక కాన్ఫరెన్సుకి వెళ్ళవలసి రావడంతో, పంజాబ్ రాష్ట్రంలోని లూధియాన నగరానికి వెళ్ళాను. అక్కడి వారు సమావేశానికి హాజరయిన ప్రతినిధుల కోసం ఎన్నో ఏర్పాట్లు చేశారు. అన్నీ బాగానే ఉన్నాయి కాని వంటదగ్గర కొచ్చేసరికి మన దక్షిణాత్యులకి వారి వంటకాలు నచ్చలేదు. సమావేశం నాలుగు రోజులు జరుగుతుంది. ఈ నాలుగు రోజులూ ఎల్లా గడుస్తాయిరా భగవంతుడా అని దిగులు పట్టుకుంది. అయితే అక్కడ పాలూ పళ్ళూ పుష్కలంగా దొరుకుతాయి. రెండో రోజు మధ్యాహ్నం నాకు వారి వంట ఏమాత్రం నోటి కెక్కలేదు. ఆకలి నకనక లాడుతుంటే మంచి ఎండలో బయలుదేరి మైలు దూరం నడిచి వెళ్ళి కాసిని పళ్లూ పాలూ పుచ్చుకున్నాను. అయినా అవేవీ అన్నానికి సాటి రావాయె. తిరిగి విడిదికి వచ్చేసరికి, ఆహ్వాన సంఘ సభ్యులు, వంటశాల బయట కూర్చుని మాట్లాడు కుంటున్నారు. నన్ను చూడగానే అవీ ఇవీ మాట్లాడి 'భోజనం అయిందా ?' అని అడిగాడు ఒక సర్దార్‌జీ. నేను నసుగుతూ సమాధానం చెప్పాను. "ఇంకేమైనా కావాలా ?" అని మళ్ళీ అడిగాడు సర్దార్జీ.

## కె. ఆర్. కె. మోహన్

మండుటెండలో వచ్చానేమో కాస్త మజ్జిగ త్రాగితే బాగుండు ననిపించి "మజ్జిగ ఉంటే ఇయ్యండి" అన్నాను.

వాళ్ళు మజ్జిగ కంటే పాలనే ఎక్కువ వాడుతారు. ఉన్న కాస్త మజ్జిగా వాళ్ళ దగ్గర అయిపోయినట్లుంది. ఆ సర్దార్‌జీ బాధపడ్తూ "మజ్జిగ అయిపోయిందండీ" అన్నాడు.

"సర్లెండి. పర్వాలేదు" అంటూ నేనొక అడుగు ముందుకు వేశాను.

వెంటనే ఆ సర్దార్జీ నన్ను పిలిచి ఆపాడు. "మీరు మా అతిథులు. మీరు ఇల్లా వెళ్ళకూడదు. మజ్జిగ తీసుకునే మీరు వెళ్ళాలి. అతిథులకు అడిగినది ఇయ్యక పోవడం మహాపాపం "ఉండండి....ఇప్పుడే తెప్పిస్తాను" అంటూ నేను "వద్దు వద్దు" అంటున్నా వినకుండా, మరో మనిషిని సైకిలు మీద పంపించి మజ్జిగ తెమ్మన్నాడు. మరో అరగంటలో చల్లని మజ్జిగ వచ్చింది. దానిని నాకు గ్లాసులోపోసి అందజేస్తుంటే ఆయన సంతోషం వర్ణనాతీతం. నేను త్రాగుతున్నది మజ్జిగ అనిపించ

లేదు. అది కేవలం పంజాబీ సోదరుల ప్రేమాభిమానాలు. వారి అతిథి మర్యాదలకు ముగ్ధుడి నయ్యాను.

ఇంక రెండవ అనుభవం. అది 1964 వ సంవత్సరం. ఒక చిత్రానికి కథ వ్రాసే అవకాశం వచ్చిన సందర్భంలో నేను మద్రాసు వెళ్ళవలసి వచ్చింది. నగరంలో రాత్రిపూట దిగాను. నేను మైలాపూర్ వెళ్ళాలి. సెంట్రల్ స్టేషన్ నుండి బస్ ఎక్కి మైలాపూర్‌లో నేను దిగవలసిన స్టేజి వద్ద దిగాను. మా వాళ్ళ ఇల్లు సి. ఐ. టి. కాలనీలో ఉంది. అక్కడి నుంచి అది సుమారు మైలు దూరం ఉంటుంది. అక్కడ ఒక్క రిక్షా కూడా దొరకలేదు. చేతుల్లో బెడ్డింగ్‌నీ, సూట్‌కేసునీ పట్టుకుని, నా దారి పట్టాను. రెండూ బరువైనవి కావడంతో చేతులు లాగజొచ్చాయి. రాత్రిపూట దిగడంతో దారి కూడా సరిగ్గా జ్ఞాపకం రాలేదు. ఇంతలో ఇద్దరు స్టూడెంట్సు, ఏవో మాట్లాడుకుంటూ అటు వచ్చారు. వాళ్లని నా దారి గురించి అడిగాను. వాళ్ళు సరిగ్గానే దారి చెప్పారు. "మేమూ అటే వెళ్తున్నాము. మా వెంట రండి" అన్నారు. మళ్ళీ ఏమనుకున్నారో "మీరు చాలా అలసిపోయినట్లున్నారు. ఆ సామాను ఇలా ఇయ్యండి. మీకు సాయం చేస్తాం" అంటూ వద్దు వద్దంటున్నా వినకుండా, ఇద్దరూ చెరోటీ పుచ్చుకున్నారు. పాపం వాళ్ళు ఆ సామానుని, మా ఇంటిదాకా మోసుకొచ్చి మరీ వెళ్లారు. వారి సంస్కారాన్ని, సాటి మానవులపై వారికి కల సౌహార్ద్ర భావాన్నీ ఏ విధంగా చెప్పను !

ఇప్పుడు చెప్పిన రెండు విషయాలూ చిన్నవే. కానీ వాటి వెనక కల విశాల దృక్పథం, ఐక్యభావం, మనందరిలో ఉన్న భారతీయ సంస్కృతి ఒక్కటే అనీ, మనమంతా ఒక్కటే అనీ, చాటి చెప్తోంది.

★★★

# బాలవాణి

సోమంచి రామం

## శ్రీరస్తు

శ్రీరస్తు! శుభమస్తు!! శ్రీకారమస్తు
సకల భోగభాగ్య సంప్రాప్తిరస్తు !
విజయీభవ ! దిగ్విజయీభవ !! ||శ్రీ||

అల్లరిచేయక - కల్లలాడక
ఉల్లాసంగ ఉరికే పిల్లలమండీ
విల్లంబులతో విచ్చేసితిమండీ ! ||శ్రీ||

జాతి భేదాలెంచక
భాషా వాదాలుంచక
బరువు బాధల తలపే రాని
బాలబాలికలమై వచ్చామండీ ! ||శ్రీ||

సరదా మెండుగ నిచ్చేటి
దసరా పండుగ వచ్చేను
పిల్లలు కోరేది పప్పు బెల్లాలు
పెద్దలు కోరేది శాంతి సౌఖ్యాలు ! ||శ్రీ||

పిల్లల బుద్ధులె పరిశుద్ధములు
ఎల్లవేళల ఎదుగుచునుండే
చల్లని మనసుతో చక్కగ చెప్పేమండీ ||శ్రీ||

సర్వశక్తి సంపన్నుడు
సర్వసృష్టి కారకుండు
సర్వేశ్వరుండు మిమ్ము
సంరక్షించుచుండు ! ||శ్రీ||

కలతలన్ని తొలగించి
తలచినట్టి పనులన్ని
తప్పకుండ జరిపించు
విఘ్న నాయకుండు వినాయకుండు ||శ్రీ||

# పేరులో ఏముంది ?

" పేరులో ఏముంది ?" అన్నాడు షేక్స్పియరు. ఇప్పటికీ అదే మాట చాలామంది అన్నా షేక్స్పియరు పేరు మీదనే ఆ సామెత నిల్చిపోయింది. షేక్స్పియరు చాలా పేరున్న వారు మరి.

పేర్లలో ఎంత వైవిధ్యం వున్నదో చూడండి. కొన్ని పేర్లు పొడుగాటివి, కొన్ని పేర్లు పొట్టివి, కొన్ని అందమైనవి, కొన్ని అంద వికారమైనవి, కొన్ని విన సొంపైనవి,కొన్ని కర్ణకఠోరమైనవి.

నిజానికి తూర్పు ఐరోపా, దక్షిణ సోవియట్ యూనియన్ వారి పేర్లు కర్ణకఠోరంగా వుంటాయి.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

కవులూరి శంకర్

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

అషితోర్కేవ్, శైకోవ్‌స్కీ, కాస్మోడెమ్యన్ స్కయా మొదలైనవి కొన్ని వుదాహరణలు.

ఒకసారి ఒక కాలేజీ లెక్చెరరు క్లాసులోకి వెళ్ళి అన్నాడు " చాలా విచారకరమైన వార్త. డాగ్ హామర్‌షక్జోయెల్డ్ మరణించాడు. " ఆ వార్త విన్న వాళ్ళందరికీ చాలా విచారం కలిగి వుండాలి. " పాపం హేమర్షెల్డు " అనిపించి వుండాలి.

ఇక ఆంగ్లేయుల పేర్లు ఎంత తమాషాగా వుంటాయో. ప్రఖ్యాత ఆంగ్ల క్రికెట్ ఆటగాడు బాయ్‌కాట్. (బాయ్ కాట్ అంటే బహిష్కరించుట అని అర్థము ). ఇంకా వుల్ఫ్ ( తోడేలు ), లాంబ్ ( మేక ), స్నో (మంచు) వింత పేర్లు. ఇవి గాక వైట్, బ్రౌన్, గ్రీన్ కూడా వున్నారు. ఇంకా సౌత్, వెస్ట్ గూడా వున్నారు.

షేక్స్పియరు సృష్టించిన ప్రఖ్యాత విషాదాంత కథానాయకుడు హేమ్లెట్. (హేమ్లెట్ అంటే పల్లెసీమ అని అర్థం ) షేక్స్పియరు సృష్టించిన ప్రఖ్యాత హాస్యగాడు సర్ టోబీ బెల్చ్. (బెల్చ్ అంటే ' తేనుపు ' అని అర్థం). బెల్చెర్ ( తేన్చువారు ) అని పేరుగల వాళ్ల అమెరికా, ఇంగ్లండులో చాలామంది వున్నారు.

ఇంకా కొన్ని పేర్లు చాలా అందమైనవి. విక్టర్ హ్యూగో రాసిన ' ది హంచ్ బేక్ ఆఫ్ నోటర్ డేమ్ ' నవలలో హీరో పేరు ఫీబస్. (ఫీబస్ అంటే వుదయించే సూర్యుడు అని అర్థం. ) సోవియట్ అంతరిక్ష నౌక ఒక దానిపేరు ' ఓస్త్రోక్ ' ( ఓస్త్రోక్ అన్నాగూడా వుదయించే సూర్యుడు అనే అర్థం)

ఇకపోతే పేర్లలో పొడుగాటి పేర్లు ఎన్నో. ముఖ్యంగా పిల్లలకి పేరు ఎంత పొడుగుంటే అంత గొప్ప. పీటర్ పాన్ కథలో వెండీ డార్లింగు తన పేరు పీటర్ పాన్ పేరు కంటె పొడుగ్గా వుంటే [illegible] పడుతుంది కూడానూ.

రిచర్డ్ నిక్సన్ రాసిన ఆరు ఇక్కట్లు SIX EVILS లో తన పేరు, సూచించమని ఒకాయన నిక్సన్‌తో అన్నాడు. "అయితే మీ పేరు చెప్పండి" అన్నాడు నిక్సన్ ఆయనతో " అయ్యా ! ఇది మీ ఏడవ ఇక్కట్టు " అని ఆ పెద్ద మనిషి యింతపొడుగు పేరు చెప్పాడు.

ఇంగ్లండు పార్లమెంటులో రెండు వర్గాల పేర్లు టోరీలూ, ధగ్గులూ. టోరీ అంటే పుల్ల మజ్జిగ. ధగ్గులు అంటే పచ్చి దొంగలు. ఇవి తమాషాకి పెట్టిన పేర్లే. అయినా నిల్చిపోయినాయి.

' స్మిత్ ' అనే పేరుగల వాళ్ల అమెరికాలో ఒక సమస్య అయి కూచున్నారుట. ప్రతి యిరవైమందిలో ఒకరికి ' స్మిత్ ' అనే పేరు వున్నదట. తరువాత అధిక్యత ' జాన్సన్ ' ల దిట.

చైనీయుల పేర్లు చాలా పొట్టిగా వుంటాయి. మావ్ సేటుంగ్, చౌ ఎన్ లై మొదలైనవి కొన్ని చైనీయుల పేర్లు. ఎంత పొట్టిగా వున్నాయో చూడండి.

ఇక పోతే కలం పేర్లు, తెర పేర్లు ఎన్నో. ప్రఖ్యాత హాలీవుడ్ నటుడు ' కేరీ గ్రాంట్ ' అసలు పేరు ఆర్చి

బాల్డ్ లీచ్. ఇట్లాగే సోఫియా లోరెన్, మెర్లిన్ మన్రో రీటా హేవర్త్ మొదలైనవి గూడా తెర పేర్లే.

ప్రఖ్యాత రచయిత ' ఓ హెన్రీ ' అసలు పేరు విలియమ్ సిడ్నీ పోర్జర్. ఒకసారి అతను ఫోర్జరీ కేసులో జైలుకు వెళ్ళాడు. అక్కడ జైలరు పేరు ' ఓ హెన్రీ ' ఆ పేరుతోటి పోర్జర్ కథలు రాసి ప్రసిద్ధికెక్కాడు. అట్లాగే మార్క్‌ట్వైన్ అసలు పేరు శ్యామూల్ క్లెమన్స్. మిస్సిసీపీ నది ఒడ్డున పడవవాళ్ళు మార్క్ట్వైన్ మార్క్ట్వైన్ ( దానికి గుర్తుపెట్టు ) అని అరుస్తుండగా విని ఆయన దాన్నే తన కలం పేరుగా స్వీకరించాడు. అట్లాగే ప్రఖ్యాత ఫుట్‌బాల్ ఆటగాడు పీలీ అసలు పేరు గూడా ఏదో వుంది.

లెనిన్ అసలు పేరు వావెరీ ఇలియనోవిచ్. అయితే లెనిన్‌గా ప్రసిద్ధికెక్కాడు. స్టాలిన్ అసలు పేరు గూడా ఏదో వున్నది. అయితే స్టాలిన్‌గా ప్రసిద్ధికెక్కాడు. ' స్టాలిన్ ' అంటే వుక్కు మనిషి అని అర్థము.

మార్క్‌ట్వైన్ రాసిన హకల్ బెరీ ఫెన్ నవలలో హక్ యింట్లోంచి పారిపోయి ఒక జమిందారుల యింట్లో తలదాచుకుంటాడు. "నీ పేరు ఏమిటి ? " అని అడిగితే జార్జిజాక్‌సన్ ' అని చెప్తారు. మరునాడు తను చెప్పిన పేరు ఏమిటో అతనికి ఎంతకీ గుర్తుకు రాదు. ఇంటివాళ్ళ అబ్బాయి 'బక్'తో "నీకు రాయటంవచ్చునా? " రాదు. వస్తే నా పేరు రాసి చూపించు " అంటాడు. బక్ 'జార్జిజాక్‌సన్' అని రాసి చూపించగానే "అమ్మయ్య ఇది అన్నమాట రాత్రి నేను చెప్పిన పేరు " అనుకుంటాడు.

ఆంగ్లేయుల యింటి పేర్లమీద ఒక పెద్ద ప్రహసనం వున్నది. ' థామస్ ' కొడుకు ' థామ్‌సన్ ' కాగా ' జాన్ ' కొడుకు 'జాన్‌సన్' అయినాడట. 'విలియమ్' కొడుకు ' విల్‌సన్ ' కాగా రిచర్డ్ కొడుకు 'రిచర్డ్‌సన్' అయినాడట. నాటకంలో 'అలెగ్జాండరు' పాత్ర వేసినాయన ' అలెగ్జాండరు ' గా స్థిరపడి పోయినాడు. ఇక వృత్తుల మీద వచ్చిన యింటి పేర్లు ఎన్నో. బార్బర్, షెప్పర్డ్ బుచ్చర్, కార్పెంటర్ మొదలైనవి.

పేర్లలో యింత హంగామా వున్నా గూడా పేరులో ఏముంది అన్నాడు షేక్స్పియరు. ఎంత తమాషా చూడండి. 

# ప్రశ్నలు-సమాధానాలు

1. మనదేశం యొక్క జాతీయాదాయాన్ని ఎప్పుడు మొదటిసారిగా అంచనా వేశారు ?
2. ' The grand old man of India ' ఎవరు?
3. మనదేశంలో మొదటగా ఉక్కు కర్మాగారాన్ని స్థాపించిన దెవరు ?
4. మనదేశంలో జర్మనీ సహాయంతో నెలకొల్పబడిన ఉక్కు కర్మాగారమేది ?
5. 'State Bank of India' ను ఎప్పుడు స్థాపించారు.
6. 'మిలటరీ టాంక్'ను ఎవరు రూపొందించారు ?
7. బ్రాడ్‌గేజ్ వెడల్పెంత ?
8. గౌతమబుద్ధుడు ఎప్పుడు జన్మించాడు ?
9. పాకిస్థాన్ తన స్వతంత్రదినం ఎప్పుడు జరుపుకుంటుంది ?
10. మనదేశం మొదటి అఫీషియల్ క్రికెట్ టెస్టు ఎవరితో ఎప్పుడు ఆడింది ?
11. 1960 దశాబ్దంలో మనదేశానికి చెందిన ప్రముఖ హాకీ క్రీడాకారుడెవరు ?
12. మనదేశంలో నూతనంగా ఏర్పడ్డ రాష్ట్రమేది?
13. బ్రిటన్ పార్లమెంటుకు ఎన్నుకోబడ్డ భారతీయు డెవరు ?

•••○•••

1. 1968 లో, 2. దాదాబాయ్ నౌరోజీ, 3. జెమ్ షెడ్‌జీ తాతా, 4. రూర్కేలా, 5. 1955 లో 6. ఇంగ్లాండుకు చెందిన స్వింటన్, 7. 1.67 మీ. 8. క్రీ॥ పూ॥ 567 లో, 9. ఆగస్టు 14న, 10. ఇంగ్లాండుతో 1934 లో ఆడింది, 11. ధ్యాన్ చంద్, 12. మిజోరామ్, 13. దాదాబాయ్‌నౌరోజీ.

"బాబూ బాబూ ముందు మా నాయిన్ని చూడండి."

క్యూలో వాళ్ళంతా ఏక కంఠాన అరిచారు

"మాకేం పన్లు లేవా?"

"గంటయింది వచ్చి"

"వెనకొచ్చి ముందెట్లా పోతావ్."

"కానూన్ (న్యాయం) లేదా."

పోచయ్య నిస్సహాయుడై నాడు.

పోచయ్య బలహీనుడు

పోచయ్య సామాన్యుడు.

కాబట్టే పోచయ్య ఏడ్చాడు 'బాబూ- మా అయ్యకి జల్దీ ఓ సూది మందిచ్చి రక్షించండి'

శ్యామయ్యంగార్ చిరచిరలాడాడు. ఓ కుక్కనో నక్కనో చూచినట్లు చూశాడు-

(జరిగిన కథ)

డా॥ రాజు కూతురు రాణి, రవి అనే యువకుడ్ని ప్రేమిస్తుంది. వాళ్ళు ప్రతి సాయంత్రం సినిమాలకి, షికార్లకి వెళ్తూంటారు. ఆరోజు సినిమాహాల్లో రవి డా॥ మకరంద్‌ని చూస్తాడు. ఫోన్ వస్తే వెళ్తున్న డా॥ మకరంద్ వంక భయం భయంగా చూచాడు రవి. బాగా సీరియస్ రోగులకి డా॥ రాజు ట్రీట్‌మెంట్ చేస్తాడు. మిగతా వాళ్ళని శ్యాం ట్రీట్ చేస్తాడు. ఒక రోజులో తగ్గే రోగాల్ని పదిహేను రోజులు చేసి డబ్బు గుంజుతాడు, రంగు నీళ్ళు ఇచ్చి. అలా శ్యాం చేతిలో చిక్కినవాడు యాదగిరి.

(ఇక చదవండి)

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్




# హ్యూమానిటీ ఫర్ సేల్

'రా- ఇటు వచ్చిచావు- అరేయ్ ఆ ముసలోణ్ణి ఇటు పడుకో బెట్టండి- ఏవచ్చింది వీడికి-'

'తెలియదు బాబయ్య'

"ఏముంది- పూటుగా తాగి రోడ్డుమీదపడి దొర్లుతూ వుంటాడు- ఆదే రోగం-"

పోచయ్య బలహీనమైన మనస్సులో రేఖా చిత్రం శబ్ద చిత్రం మెరిసింది "ఏం, పూటుగా తాగి పరుపుల మీదపడిదొర్లడం మాత్రం రోగం కాదా - వాళ్ళ సమాజానికెలా మిత్రులు ?"

శ్యాం యాదగిరిని పరీక్షించాడు-

కేసు కొంచెం సీరియస్‌గానే వున్నట్లు తోచింది- డాక్టరు రాజును పిలుద్దామా అని ఆలోచించాడు. కాని రాజు ఇప్పుడు లతతో మాట్లాడుతున్నాడు.

లతతో రాజు ఏకాంతంగా వున్నప్పుడు ఎవ్వరూ ఆ గది చాయలకే వెళ్ళకూడదు.

" ఎప్పట్నించి తిరగ బెట్టిందిరా వీడికి "

" తెలీదు బాబూ ఇందాక మీ దవాఖానా వచ్చిండు- అంతే అప్పటినుంచీ ఇట్లా నురుగులు కక్కుతాండు- "

శ్యాముకు ఈ మాటలు చాలా అవమానంగా తోచాయి.

' అంటే దవాఖానాకువస్తే రోగం తగ్గడానికి బదులు పెరిగిందని అంటావురా బద్మాష్- '

" దొరా- దొరా- బానిసను నేనామాట అన్లేదు దొరా

"లేకుంటే దవాఖానాకు వచ్చాక పెరగడ మేమిటి ఎక్కువ కావడమేమిటి ? "

శ్యాము ఆలోచించాడు- చాలా ఎక్కువ లక్షల పొటెన్సీకల పెన్సిలిన్ ఇవ్వాడు యాదగిరికి-అది పడలేదు- రియాక్షన్ ప్రారంభమైంది-అసలు యాదగిరి కడుపునొప్పికి మందే అనవసరం- పెన్సిలిన్ అసలు అనవసరం-" కేసు కొంచెం సీరియస్‌గా వుంది- జల్దీ ఓ యాభై రూపాయలు పట్రా-"

" బానిసను దొరా మీ కాళ్ళకు మొక్కుతా - గరీబోణ్ణి దయచూడండి "

శ్యాముకు బాగా కోపం వచ్చింది.

" అంటే ఇదేం సర్కారీ దవాఖానా అనుకున్నావా - వీడికి సీరియస్‌గా వుంది. యాభై రూపాయలు తెస్తేనే కాని నయం కాదు. "

" దొరా - పహలే ( ఫస్టు ) కు తనఖా ( జీతం ) దొరగ్గానే మీ ఋణం తీర్చుకుంటాను. ముందు మందు లియ్యండి దొరా. "

శ్యాము వినుకోకుంటు కొన్ని మందులు రాసిచ్చాడు - " జల్దీ పరుగెత్తుకుంటూపోయి నారాయణగూడాలో ఇవి కొనుక్కురా. "

" ఎంతవుతుంది ? " వణుకుతున్న కంఠంతో అడి గాడు పోచయ్య.

" ఓ పాతికో ముప్పయ్యో అవుతుంది. వెళ్ళు - ఆ నెక్స్ట్, తరువాతవాడు రావయ్యా ! చీటీని తీసుకొచ్చావా - "

పోచయ్యను పక్కకు నెట్టి తరువాతి పేషెంటు ముందుకొచ్చాడు క్యూలో నుండి

జీవో జీవస్య జీవనమ్ -

స్ట్రగుల్ ఫర్ ఎగ్జిస్టెన్స్.

ఎవడి ప్రాణంమీద వాడికి తీపి.

పొద్దుగూకులూ పోచయ్య కేసేనా ?

పోచయ్య ఏడుస్తూ అన్నాడు ' నా దగ్గర డబ్బులేదు.' క్యూలో నిలబడ్డ పేషెంట్లంతా పోచయ్యనొక వింత మృగంలా చూచారు .

' డబ్బులేకుంటే చావు ' శ్యాంవిసుక్కున్నాడు ఎర్ర రంగు నీళ్ళు కలుపుతూ.

శ్యాం అన్న రసవత్తరమైన ఛలోక్తికి మళ్ళీ క్యూలోని పేషెంట్లంతా నవ్వారు.

పోచయ్యకు దిక్కూ దరీ తోచలేదు.

డాక్టర్ రాజుకు చెప్పితే.

ఆయన దయామూర్తిట.

ఎన్నో ధర్మసంస్థల్లో సభ్యుడుట.

హైదరాబాదులోని ప్రతి పెద్ద సభలకూ ఆయన అధ్యక్షుడు, కన్వీనర్, కమిటీ మెంబర్.

పోచయ్య మెట్లెక్కబోయాడు.

రెండు మెట్లెక్కాడు

శ్యాము ఫెళ్ళుమని పోచయ్యను కొట్టాడు

" బద్మాష్ ఎక్కడరా పోతున్నావు ? "

" పైకి........ అయ్యదగ్గరకి........ " రుద్ధకంఠం.

" వీడు మనషేనా-మర్యాద కొంచెమైనా తెలుసా ! అయ్యగారు ప్రైవేట్ రూంలో వుంటే వీడు మేడమెట్లెక్కుతాడా ?.... "

" ఛీ- ఛీ- ఛీ- " క్యూలోని పది కంఠాలు-

శ్యామానికి మనిషిలోని మహిషత్వం బాగా తెలుసు -

మానవుడు ఎలా గొర్రెలా బతుకుతాడో కూడా తెలుసు.

" ఇట్లాంటి దొంగ గాడిదకొడుకులేనండీ డాక్టర్లకు అపకీర్తి తెచ్చేది - అమాయకుల్లా వచ్చేదీ, ఆసుపత్రివద్ద రోగుల్లో అందమైన పిల్లలను చూచేదీ, వైద్యానికనో, విద్యకనో ఏదో సాకు చెప్పి తమ ముఠావాళ్ళ ద్వారా విదేశాలకు తీసుకుపోయి బ్రోతల్ హవుసెస్‌కు అమ్మేదీ - చూడండి వాడి దురుసుతనం "

" రాస్కెల్‌లాగే వున్నాడు వాడు " శ్యామయ్యంగార్ ప్రవచనానికి మద్దతుగా ఓ రెండు గొర్రెల మ్యామ్యాలు-

నిజానికి డాక్టర్ రాజు బొంబాయిలోని ప్రముఖ హోటళ్ళకూ అరబ్ దేశాలకూ పర్షియన్ సింధు శాఖకూ అమ్మాయిలను విద్య పేర వైద్యం పేర చేరదీసి స్మగ్లర్ల సాయంతో అమ్ముతున్నారని పుకార్లు ! !

అయినా క్యూలోని గొర్రెలకు శ్యామయ్యంగారి మాటలే సమ్మోహన మంత్రాలు.

మానవుడు లోక వంచనలోనూ అంతకుమించిన ఆత్మ వంచనలోనూ యుగయుగాలుగా ఘనుడు. శ్యాము దెబ్బకు కిందపడ్డ పోచయ్య దీనంగా లేచాడు.

" రోగులు కాదు వీళ్ళు రాబందులు " శ్యాం గర్జించాడు – " ఇట్లాంటి లుచ్ఛాకోర్ల వల్లనే రోగులందరూ మాట పడవలసి వస్తున్నది " శ్యాం చెప్పిన రాబందుల గుంపు నుండి తన్ను తాను రక్షించేకున్నాడొక వైట్ కాలర్ పేషెంట్ -

పోచయ్య పెద్దగా ఏడ్చాడు.

ఆడదానిలా ఏడ్చాడు.

ఆడవాళ్ళకన్న హీనంగా ఏడ్చాడు.

" ఫో - ముందు ఆ ఇంజక్షన్లు కొనుక్కొచ్చుకో -" శ్యాం పోచయ్య ఏడుపుకు పరిష్కారం చెప్పాడు.

రిక్షావాడు మళ్ళీ యాదగిరిని రిక్షాలో పెట్టాడు.

పోచయ్య ఏడుస్తున్నాడు.

## నిత్య సత్యాలు

" పుస్తకమును మస్తకములో చేర్చాలిగాని మస్తకమునే పుస్తకముగా మార్చరాదు.

– శ్రీ సత్యసాయిబాబా

" శీలరహితమైన విద్య ప్రమాదకరము. చాలా మంది తెలివిగల దొంగల విషయంలోను, పెద్ద మనుష్యులుగా చెలామణి అయ్యే మూర్ఖుల విషయంలోను ఇది వెల్లడవుతుంది. "

– మహాత్మాగాంధీ

" విద్యా ధనాలు విరివిగా ఉన్నా గర్వంలేకుండా చరించేవాడే పండితుడు. "

– విదురుడు

" విద్య అనే మహావృక్షం వేళ్ళు చేదుగావున్నా అది అందించే ఫలాలు మాత్రం తియ్యగా వుంటాయి. "

– ఆరిస్టాటిల్

" కొద్ది భావాలు కలిగిన గొప్పవాండ్లవల్ల దేశం శక్తివంతం కాదు. గొప్ప భావాలు కలిగిన కొద్దివాండ్లవల్ల దేశం వర్థిల్లుతుంది. "

– స్వామి రామతీర్థ

" ఇంద్రుడైనను తనను తాను స్తోత్రము చేసికొనినచో గడ్డి పరకకన్నను తేలికయగును. "

– చాణుక్యుడు

" దేశ నిర్మాణం త్యాగాలతో, రక్త తర్పణాలతో జరుగుతుంది కాని తీయని మాటలతో కాదు."

– శ్రీగురూజీ

" పోచయ్యా - ఏడవకు - పద అటు పోదాం''
" ఎటు " అని పోచయ్య అడగలేదు.
రిక్షా నడుస్తున్నది,
పోచయ్య నడుస్తున్నాడు.
కాలం మాత్రం పోచయ్య మనస్సులో స్తంభించి పోయింది.
" బద్మాషోడు - సూదిమందులన్నీ కొనిపిసడు - మళ్ళీ రాత్రికల్లా నారాయణగూడాలోనే అమ్ముకొంటడు. నా కెరిక లేదేంటి వాడి బద్మాష్ - " రిక్షావాడు శ్యాం జీవన రహస్యాన్ని బయట పెట్టాడు.
రిక్షా మకరంద్ దవాఖానా ముందు ఆగింది.
" పోచయ్యా - ఈ కొత్త డాక్టరు మంచోడు - లోపలికి తీసుకెళ్ళు. "
మకరంద్ దగ్గరా క్యూ వుంది.
క్యూను అతిక్రమించడం నేరం - డిసిప్లెన్‌కు విరుద్ధం నిజమే - కాని
క్రమ శిక్షణ మానవుడికోసం
మానవుడు క్రమశిక్షణకు బలి కావడానికి కాదు. పల్నాటి చేంతాళ్ళలా అనంతమైన క్యూలు ఎప్పుడూ వుంటూనే వుంటాయి అన్నిటికీ.
క్యూలో తనవంతు రేషన్ వచ్చేసరికే మరణించేవాళ్ళు అసంఖ్యాకులు.
మకరంద్ ప్రాణాచార్యుడు - ప్రాణానికి రక్షకుడుగా వుంటానని ప్రమాణం చేసి పట్టా తీసుకొని సమాజంలోకి వచ్చిన ధన్వంతరి.
పోచయ్యను చూస్తూనే మకరంద్, కాంపౌండర్ నరసింగరావూ పరుగెత్తుకుంటూ గుమ్మంలోకి వచ్చారు.
పేషెంటును చక్రాల బండిమీదికెక్కించాడు. ఏడుస్తూ పోచయ్య తండ్రి జబ్బుకు కారణం చెప్పాడు -
చెప్పాననుకున్నాడు -
చెప్పాడో - ఏడ్చాడో తెలియదు.
మకరంద్ ముందుగా ఒక ఇంజక్షను ఇచ్చాడు - నరసింగరావుతో ఇంగ్లీషులో అన్నాడు " ఇతనికి రాంగ్ ట్రీట్‌మెంటు జరిగింది - డ్రగ్ డిసీజ్ మొదలైంది. రాంగ్ డయాగ్నసిస్ - రాంగ్ ప్రిస్క్రిప్షన్....
" ఎవడయ్యా మీ అయ్యకు మందిచ్చింది "
" ఆ రాజుగారి దవాఖానాలో బాబూ " పోచయ్య ఏడుపును ఆపుకొని చెప్పాడు.
శ్యామయ్యంగార్ తత్వం నరసింగరావుకు బాగా తెలుసు. మనిషి చచ్చినా ఫరవాలేదు కాని తన కేసు మరొకరు ముట్టుకుంటే మండిపడతాడు. వాళ్ళని సాధించి సాధించి వదిలిపెడతాడు - నరసింగరావు అన్నాడు.
" బాస్ వాళ్ళు ట్రీట్ చేస్తున్న కేసును వదులుకుంటే గాని మనం చేబట్టడం బాగుండదేమో "
మకరంద్ సీరియస్‌గా నవ్వాడు. " నా గుమ్మంలోకి వస్తే నా పేషెంటే - రాకపోయినా కూడా ప్రతి రోగీ నా పేషెంటే, వస్తే ఇంక పూర్తిగా నా పేషంటేనని అర్థం .... "
ఈ అర్థం నరసింగరావుకు రుచించిందో లేదో ....
పోచయ్య ప్రశ్నించాడు తండ్రిని గూర్చి.
" ఏం గాభరా పడకు, నీ పేరేమిటి "
" పోచయ్య "
" పోచయ్యా కాసేపు ఆ విజిటర్స్ రూంలో విశ్రాంతి తీసుకో. నరసింగరావ్ కారీ ఆన్, ( ఈ పేషెంట్లను నువ్వు చూసుకో ) " యాదగిరి అర్ధమృత శరీరంతో మకరంద్ లోనికి వెళ్ళాడు.
మృత్యువు నోట్లోని కబళాన్ని మకరంద్ బయటకు గుంజాలి.
యాదగిరి మృత్యుంజయుడని నిరూపించాలి.
మందులతో మాకులతో కాదు.
ఆత్మ బలంతో,
సంకల్పశక్తితో.
మకరంద్ సంకల్పం స్వచ్ఛమైనదేనా ?
ఆత్మ విశ్వాసం దైవాయమైనదేనా ?
యాదగిరి నిర్ణయించాలి దీన్ని.
నిర్ణయించాడు దీన్ని.
యాదగిరి బ్రతికాడు, కళ్ళు తెరిచి లోకాన్ని మళ్ళీ చూచాడు.
పోచయ్య ముఖాన చిరునవ్వు వికసించింది.
మనస్సులో మాత్రం విషభాండం బద్దలైంది
" ఈ రాజూ, శ్యామూగాళ్ళ అంతు చూస్తాను నేను."
( సశేషం )

# ఉపనిషత్కథ - ఉషస్తి మహర్షి

## ( ఛాందోగ్యోపనిషత్తు )

కురుదేశం లోని సరస్వతీనదీ తీరంలో చాక్రాయణుడైన ఉషస్తి మహర్షి ఆశ్రమం ఉంది. గొప్ప విద్వాంసుడు, నైష్ఠికుడు – అయిన ఉషస్తి ఋషి గృహస్థుడై, వేదాధ్యయన అధ్యాపనాది ధార్మిక కర్మానురక్తుడై, ఆశ్రమ నిర్వహణం చేస్తూ ఉండేవాడు.

విధివశాత్తూ ఆ కురుదేశమంతటా తీవ్రమైన క్షామం సంభవించింది. అన్నపానాదులకు కటకట ఏర్పడింది. క్షుద్బాధ మహర్షికి కూడా తప్పలేదు. భార్యాసమేతుడై ఆశ్రమం వదిలిపెట్టి, ప్రయాణం సాగిస్తున్న ఉషస్తి ఋషికి ప్రాణం కడగట్టిపోయింది. కళ్ళు చీకట్లు కమ్మినాయి. కాళ్ళల్లో సత్తువ లేకుండా పోయి అడుగు ముందుకు వేయటం కష్టమయింది.

అప్పటి అశక్త స్థితిలో – వారికి ఒక మావటివాడు ఆపద్బాంధవునివలె ఎదురైనాడు. తినటానికి ఏదైనా తెచ్చిపెట్టమని అతడిని ఉషస్తి ఋషి అడిగినాడు.

" స్వామీ ! మీకు ఇవ్వదగిన ఆహారం నావద్ద ఏమీ లేదే ! అయినా, ఇవిగో నేను తింటూఉన్న అలవంద గుగ్గిళ్లు కొన్ని స్వీకరించండి. ఇవిగో, కొన్ని నీళ్లు కూడా వీటితోపాటు గ్రహించండి "....అన్నాడు మావటి వినయంగా. ఉషస్తి ఆ ఉచ్ఛిష్టాహారాన్ని కొంత భార్యకు ఇచ్చి, తాను కొంత భుజించి సేద తీరినాడు. అంతమాత్రానికే, పోతున్న ఊపిరి తిరిగి వచ్చినట్లయింది.

" నాయనా, ఈ ఎంగిలి నీళ్ళు పరిశుభ్రమైనవి కావు కనుక నేను స్వీకరించలేను. ఇంద – తీసుకో " .... అన్నాడు మహర్షి.

ఏమిటి ఈ విచిత్రం ! సగం తిని మిగిల్చిన గుగ్గిళ్లు పనికిరాగా లేనిది – ఈ నీరు మాత్రమే నిషిద్ధమైనదా !– ఆశ్చర్యమైనది మావటివానికి.

అప్పుడు ధర్మనిష్ఠుడైన ఆ ఉషస్తి మహర్షి ఇట్లా అన్నాడు–

" అబ్బీ ! శరీరం నుంచి లేచిపోతున్న ప్రాణాన్ని నిలుపుకోవటం ధర్మం కనుక పట్టింపు లేకుండానే నీ విచ్చిన ఆహారం భుజించాను ఆపద్ధర్మంగా. ఇప్పుడు ఈ ఎంగిలి నీళ్ళను త్రాగనందువల్ల నా ప్రాణం పోదు కదా ! ఇలా చేయటంవల్ల ధర్మోల్లంఘన చేసినట్లు అవుతుంది. ప్రాణాన్ని కాపాడుకొనేటంత వరకే నియమ భంగం క్షంతవ్యం " ....

**సి. వేదవతి**

ఒక మహారాజు ఆ దరిదాపులలోనే యజ్ఞం చేస్తున్న విషయం తెలిసి అక్కడకు వచ్చినాడు మహర్షి. మహారాజు ఉషస్తిని చూచి, అతడెవరో తెలుసుకొని భక్తితో స్వాగతం పలికి సత్కరించినాడు.

హోమ గుండానికి నలువైపులా ఆశీనులై యజ్ఞ విధులను నిర్వహిస్తున్న ఋత్విక్కులలో వలసిన ఏకాగ్రత కానీ, శ్రద్ధానక్తులు కానీ, కనిపించలేదు మహర్షికి.

" ఋత్విక్కులారా ! ఇప్పుడు మీరు ఉపాసన చేస్తున్న దేవత ఎవరో ఎరుగుదురా ? ఈ దేవత స్వరూపం తెలియదనే, భక్తి శ్రద్ధలు లోపించిన ఉపాసన మీరు చేసినట్లయితే మీ శిరస్సు నేలపై పడిపోతుంది " ....అన్నాడు ఉషస్తి.

మహారాజుతో పాటు ఆ ఋత్విక్కులున్నూ నిశ్చేష్టులైనారు. భయ సంభ్రమాలతో అవాక్కులైనారు.

అప్పుడు మహా విద్వాంసుడైన ఉషస్తి మహర్షి – వారందరికీ ఉపాస్య దేవతా స్వరూపములను గురించి ఈ విధంగా తెలియ చెప్పినాడు.

( తరువాయి 35 వ పేజీలో )

# ఓకే జాబ్ (అనువాద కథ)

రచన : డగ్గస్ బేకర్
అనువాదం : మల్లాది వెంకటకృష్ణమూర్తి

మైక్ ఆ దుకాణం తలుపు తెరిచి పట్టుకున్నాడు మర్యాదగా.

ఓ యువతి మైక్ తెరచిన తలుపులోంచి లోపలకి వెళుతూ నవ్వింది. అతను సమాధానంగా నవ్వాడు. తలుపు వదిలేయగానే స్ప్రింగ్ తలుపు మూసుకుంది.

మైక్ బయటకి వచ్చాడు. పార్కింగ్ ప్రదేశంలోని ఓ కారు తలుపు తెరుచుకుని అందులో కూర్చున్నాడు. ఇగ్నిషన్ కీ తిప్పి కారు స్టార్ట్ చేశాడు.

అకస్మాత్తుగా కారు వెనుక తలుపు తెరుచుకుంది. ఎవరో లోపలకి ఎక్కారు.

మైక్ వెనక్కి తిరిగి చూశాడు. ఓ పొడుగాటి వ్యక్తి వెనక సీట్‌లో కూర్చొని వున్నాడు. అతని ఒళ్ళో ఓ పెద్ద పెట్టె, చేతిలో తుపాకీ వున్నాయి.

మరో లావుపాటి వ్యక్తి పక్క తలుపు తెరుచుకొని ఆ పొడుగాటి వ్యక్తి పక్కన కూర్చున్నాడు, మైక్ చూస్తుండగానే.

" పోనీ " అరిచాడతను.

అతని చేతిలో కూడా పిస్తోలు వుంది.

మైక్‌కి వాళ్ళు చెప్పింది చేయక తప్పలేదు. పిస్తోలు గొట్టం సూటిగా అతని మెడమీద గుచ్చుకుంటూంటే వాళ్ళ మాట వినక తప్పలేదు.

కారు ముందుకు పోనిచ్చాడు.

కారు వందగజాల దూరం వెళ్ళాక లావుపాటి వ్యక్తి పక్కన కూర్చున్న పొడుగాటి వ్యక్తితో చెప్పాడు ఆనందంగా.

" సాధించాం. బేంక్‌లోంచి ఇంకా ఎవరూ బయటకి రాలేదు ". " ఎడంవైపు తిప్పు " పొడుగాటి వ్యక్తి చెప్పాడు మైక్‌తో.

కారు ఎడం చేతివైపు సందులోకి తిప్పాడు మైక్.

" ఆపు "

ఆపాడు.

" ఏమిటి నీ ఉద్దేశం ? " కోపంగా అడిగాడు పొడుగాటి వ్యక్తి మైక్‌ని.

" ఉద్దేశమా ? "

" కారు ఇంత వేగంగా నడిపితే పోలీసులు చూసి ఆప మంటారనా ? ఆ విధంగా మమ్మల్ని పట్టిద్దామనా ? "

" బేంక్‌లో దొంగతనం చేసి వస్తున్నారా మీరు ? " అడిగాడు మైక్.

లావుపాటి వ్యక్తి పెట్టె తెరచి అందులోంచి అయిదు డాలర్ల నోట్ల కట్టలని బయటకి తీసి చూసి చెప్పాడు పొడుగాటి వ్యక్తితో.

" ఫర్వాలేదు "

" బేంక్ కౌంటర్‌లో కూర్చున్న అమ్మాయి భయంతో మూర్ఛపోతుందను కున్నాను పిస్తోలు చూడగానే " నవ్వాడా పొడుగాటి వ్యక్తి.

" తనే స్వయంగా పెట్టెలో నింపి ఇచ్చింది ఆ నోట్లని. మనమంటే గౌరవం" నవ్వాడు ఆ లావుపాటి వ్యక్తికూడా.

" ఉహూ. మనమీద కాదు. దీనిమీద " పిస్తోలుని ఓసారి ఎగరేసి పట్టుకున్నాడు పొడుగాటివ్యక్తి.

ఇద్దరూ కలసి నవ్వారు ఈసారి.

" పోనీ " చెప్పారు.

కొద్ది నిమిషాలు మౌనంగా గడిచాయి.

" థాంక్స్. నువ్వు సరిగ్గా ఆ సమయానికి కారుతో మా కంటబడకపోతే ఏమయ్యేవాళ్ళమో తలచుకోవా లంటేనే భయంగా వుంది. "

" బేంక్‌ని దోచుకోడానికి ప్రయత్నించినవాళ్ళు ఎలా పారిపోవాలో ముందే అనుకోలేదా ? " అడిగాడు మైక్.

" మా కారు ముందే ఎవడో వెధవ తన కారుని ఆపాడు. వెనకాల ఇంకొక కారుంది. మా కారు బయటకి తీయడానికి అవకాశం లేకపోయింది "

" సరయిన సమయానికి వచ్చావ్ "

తాము దోచుకున్న డబ్బుని లెక్కపెట్టసాగారు ఇద్దరూ. ఇద్దరూ తనని జాగ్రత్తగా గమనిస్తున్నారని గ్రహించాడు మైక్.

అయిదు నిమిషాలు గడిచాక కారు వూరి పొలిమేర ల్లోకి వచ్చింది.

" ఆక్కడాపు "

లావుపాటి వ్యక్తి కారుని ఎక్కడ ఆపాలో చూపించాడు మైక్‌కి.

కారు శిధిలమయిన ఓ పాత ఇంటి ఆవరణలో ఆపాడు మైక్.

" దిగు. పద "

ముందర మైక్, వెనకాల ఇద్దరు దొంగలు ఆ ఇంట్లోకి నడిచారు.

మైక్‌ని ఆ ఇంట్లో ఓ స్తంభానికి నిలబెట్టి చేతులూ, కాళ్లూ తాళ్ళతో బలంగా కట్టేశారు.

" అరగంట తర్వాత పోలీసులకి ఫోన్ చేసి నిన్ను విడిపించమని చెప్తాం " చెప్పాడు పొడుగాటి వ్యక్తి.

" ఎంత గట్టిగా అరచినా బయట ఎవరికీ వినబడదు నీ గొంతు. అందుకే నోట్లో బట్టలు కుక్కడంలేదు. " చెప్పాడు లావుపాటి వ్యక్తి.

" నేను అరవను. మీరు అట్టే దూరం వెళ్ళలేరు. " చెప్పాడు మైక్.

దొంగలిద్దరూ బయటికి వచ్చారు. లావుపాటి వ్యక్తి డ్రయివింగ్ సీట్‌లో, అతని పక్కన పొడుగాటి వ్యక్తి కూర్చున్నారు.

మైలు దూరం వెళ్ళకుండానే పోలీస్ పెట్రోల్ కారు వారి కారు వెంట పడసాగింది. పోలీసులు వారి కారుని ఆపేశారు.

వాళ్ళ కారు తలుపు తెరిచిన ఇనస్పెక్టర్ చెప్పాడు.

" అబద్ధాలతో కాలం వృధా చేయకండి. మీరు దొంగలని తెలుసు మాకు "

ఇద్దరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు ఆశ్చర్యంగా.

" దిగండి ఈ కారుని దొంగిలించారు మీరు "

ఇద్దరూ కారులోంచి కిందకి దిగారు. అప్పటికే చాలా మంది పోలీసులు ఆ కారుని చుట్టుముట్టారు.

" ఈకారుని దొంగిలించిన సంగతి ఎలా తెలుసు మీకు ? " అడిగాడు పొడుగాటి వ్యక్తి..

"ఈ కారు యజమాని ఇందాకే మాకు ఫోన్ చేయడం జరిగింది "

" అతనంత త్వరగా ఫోన్ చేయగలిగాడా ? చుట్టు పక్కల ఎక్కడా ఫోన్ కూడా లేదే ? "

" అతనా ? అంటే ? "

" కారు యజమాని. ఊరు చివర పాడుబడ్డ ఇంట్లో బంధించి వస్తున్నాం. "

" అతను కాదు. ఆమె. పావుగంట క్రితం ఈ కారు పోయిందన్న సంగతి ఈ కారు యజమాని మేరీ ఫోన్ చేసి రిపోర్ట్ చేసింది. బేంక్ లోకి వెళుతూ కారుని బయట ఓ దుకాణం ఎదురుగా వున్న పార్కింగ్ స్పేస్‌లో ఆపి వెళ్ళింది. తిరిగి బయటకి వచ్చి చూసేసరికి ముగ్గురు వ్యక్తులు తన కారులో వెళ్తుండటం చూసి రిపోర్ట్ చేసింది మాకు". చెప్పాడు ఇన్‌స్పెక్టర్ వాళ్ళిద్దరికి.

" సర్ కారులోని పెట్టెలో, బేంక్‌లో పోయిన ఐదు డాలర్ల నోట్లకట్టలున్నాయి ? " ఓ పోలీస్ వచ్చి చెప్పాడు ఇన్‌స్పెక్టర్‌కి హడావిడిగా.



---

## ఉపనిషత్కథ

(33 వ పేజీ తరువాయి)

" ప్రాణమే ప్రథమ ఉపాస్య దేవత. ఆదిత్యుడే ద్వితీయ ప్రణవదేవత. సర్వ ప్రాణులకు ఆధారభూతమైనది అన్నము. ఉపాస్య దేవతా స్వరూపమును ఎరుగకనే యజ్ఞ విధులను నిర్వర్తించటం నిష్ఫలమే అవుతుంది. అందుకే ఈ నా హెచ్చరిక.

జీవనాధార భూతమైనది ప్రాణశక్తి. కాని, అన్నము లేనిదే ప్రాణము నిలవదు. అన్నము ఆదిత్యుని పైన ఆధారపడి ఉద్భవమౌతున్నది. ఈ ఆదిత్య స్వరూపమే ఇక్కడ అగ్నిహోత్రుని రూపంలో ఉపాసింప బడుతున్నది. అగ్నిదేవతా స్వరూపానికి ఆహవము చేయుట వల్లనే యజ్ఞ విధి సార్థక మవుతున్నది. " .... అంటూ ఉషస్తి చాక్రాయణ మహర్షి యజ్ఞకార్య ప్రశస్తిని గురించీ ఉపాస్య దేవతా స్వరూపాన్ని గురించీ నిర్వచనం చేసినాడు. ( ఆకాశవాణి సౌజన్యంతో )

# అతి అరుదైన 'జెర్డాన్ కోర్సర్'




జీవ పరిణామక్రమంలో ప్రకృతిలోకి ఎన్నో పక్షులు వచ్చినా అవన్నీ నేడు కనిపించడంలేదు. ఎన్నో పక్షి జాతులువిలుప్తమైపోయాయి. హఠాత్తుగా వాతావరణంలో వచ్చిన మార్పులు, ఆహారపు కొరత చాలా పక్షి జాతులు అంతరించి పోవడానికి కారణాలు. మరికొన్ని పక్షి జాతులను మానవుడు తన అవివేకపు చర్యలతో అంతంచేశాడు.

ఏ జీవి మనుగడ విజయవంతమవ్వాలన్నా ఆ జాతి జీవులు ఒక కనిష్ఠ సంఖ్యలో వుండాలి. ఎప్పుడైతే ఆ కనిష్ట సంఖ్యకన్నా జనాభా తక్కువవుతుందో అప్పుడు ఆ జీవి క్రమంగా అంతరించి పోతుంది. ఆ దశలో మానవ ప్రయత్నాలు ఫలించవు.

ఈ విషయాలను దృష్టిలో పెట్టుకుని శాస్త్రజ్ఞులు ఎప్పటికప్పుడు పక్షుల జనాభాను పరిశీలించి అంచనా వేస్తుంటారు. అంతరించిపోయే అవకాశమున్న పక్షి జాతులను గుర్తించి వాటి మనుగడకు తీసుకోవాల్సిన చర్యలను ప్రచారం చేస్తారు. విలుప్తమైపోయిన పక్షుల జాబితాను కూడా వీరు తయారు చేస్తారు.

ఆ విధంగా అంతర్జాతీయ స్థాయిలో విలుప్తమైన పక్షుల జాబితాలోకి చేర్చబడ్డ పక్షి జెర్డాన్ కోర్సర్. ఇది ఒకప్పుడు మన రాష్ట్రంలోని రాయలసీమ జిల్లాలలోనూ, పెన్నా, కృష్ణా, గోదావరి నదుల ప్రాంతాలలోను విస్తృత సంఖ్యలో వుండేది. ఈ పక్షిని 1848 లో టి. సి. జెర్డాన్ అనే సైనికఅధికారి పెన్నానది ఒడ్డున కనుక్కోవటంతో జెర్డాన్ కోర్సర్ అని పిలుస్తున్నారు. కాని స్థానికంగా దీనిని కళ్యాణిగువ్వ, కలివికోడి అని పిలుస్తారు.

ఇది చిన్న కోడిపిట్టలా బూడిద రంగులో వుంటుంది. పొడవుకాళ్ళవల్ల వేగంగా పరుగెత్తగలదు. మెడభాగంలో రెండు స్పష్టమైన చారలుంటాయి. ఈ పక్షి ఎక్కువగా పొదలలో నివశిస్తుంది. నేలమీదే ఎక్కువకాలంవుంటుంది. దీని జీవన విధానాల గురించిన వివరాలు తెలియవు.

అందుకు కారణం ఈ పక్షి గత ఎనిమిదిన్నర దశాబ్దాలుగా కనిపించక పోవడమే. 1900 వ సంవత్సరంలో దీనిని చివరిసారిగా చూసినట్లు నమోదుచేసి విలుప్త జాతులలో కలిపివేశారు.

శాస్త్రజ్ఞుల అంచనాలను ఇదివరలో అనేక పక్షులు తారుమారు చేశాయి. ఉదాహరణకు ఎగురలేని చిలుక ( శ్రీవాణి, అక్టోబర్ 1985 ). అటువంటి అవకాశం భారతదేశంలోని పక్షి జాతులకు ఎందుకు వర్తించదు అనే ఆలోచనతో బొంబే నేచురల్ హిస్టరీ సొసైటీవారు పరిశీలన మొదలు పెట్టారు. వీరి శ్రమ ఈ సంవత్సరం సంక్రాంతి నాడు ఫలించింది. ఆరోజు కడప జిల్లాలోని రెడ్డిపల్లి గ్రామంలో ఒక కలివికోడిని పట్టుకోగలిగారు. దీనితో ఈ పక్షి జీవనంపై కొత్త ఆశ చిగురించింది. అందుకే ఎనభై ఆరు సంవత్సరాలపాటు శాస్త్రజ్ఞుల కళ్ళకు మస్కా కొట్టిన ఈ జెర్డాన్ కోర్సర్ నిజంగా అతి అరుదైన పక్షి.

దుగ్గరాజు శ్రీనివాసరావు

# బసవరాజు అప్పారావు కవితా రామణీయకత

— వై. నాగయ్య

ఆధునిక కాలంలో నేర్పడిన తొలి సాహిత్యోద్యమము భావకవిత్వము. కవిత్వములో నుండి వస్తు - భావ - రచనలలో భావమునకు ప్రాధాన్య మిచ్చునది భావ కవిత్వము. ఇది పాశ్చాత్య సాహిత్య ప్రభావము వలన నేర్పడి దాదాపు మూడు దశాబ్దాలపాటు ఆంధ్రసాహిత్య కేదారమున పసిడి పంట పండించినది.

ఈ భావ కవిత్వోద్యమ కాలంలోనే తనదైన ఒక ప్రత్యేక శైలిని ఏర్పరచుకొని మంజుల మనోజ్ఞమైన భావగీతాలను స్వేచ్ఛగా పాడినవారు శ్రీ బసవరాజు అప్పారావు. వీరి భావనాశక్తి ఎంతో ఉన్నతమైనది. జనపదుల బాణీలో చక్కని భావాలనల్లిన వీరికి ప్రకృతి యందెంతో మక్కువ. చక్కని ఆధ్యాత్మిక దృక్పథము కలవాడు. ఈ లక్షణాలన్నీ ఆత్మాశ్రయ రీతిలో పాడుకొన్న "బసవరాజు అప్పారావు గీతాలు" అను వీరి రచనలో మనకు కనిపిస్తాయి. వీరి కవిత్వాన్ని గురించి "నగ్నంగా నిజంగా ఉంటుంది ఈయన కవిత్వం. జలుకూ తలుకూ ఉండదు. ఉండటానికి వీలులేదు. ప్రతి భావము గుండె చీల్చుకొని దుడుకుగా వస్తుంది." అని ముద్దుకృష్ణగారు పేర్కొనిరి.

భావ కవులందరిలోను ప్రధానముగా కనబడే ప్రణయాన్నే బసవరాజుగారు మృదుమధుర పదాలతో సరళ సుందరంగా వర్ణించాడు. 'ప్రేమ తత్వము' అను గేయములో యిలా అంటాడు.

వలపెఱుంగక బ్రతికి
కులికి మురిసేకన్న
వలసి విఫలమ్మొంది
విలపింప మేలురా

ప్రేమించు సుఖముకై
ప్రేమించు ముక్తికై
ప్రేమించు ప్రేమకై
ఏమింక వలయురా

చెలి వలపు లేకుంటే ఎంత కలిమి యున్నా కల్పనే గాని నిజము గాదు. మానవుడు ఇహంలో కోరేది సుఖము, పరంలో కోరేది ముక్తి. ఈ రెండు కూడ ప్రేమించుట వలన మాత్రమే కల్గుతవి. చివరకి నీవు ఇతరులచేత ప్రేమించబడాలన్నా నీవు ప్రేమించటము అవసరము. లోకమే ప్రేమమయం. ప్రేమలేని జీవితమే లేదు. ఇది వీరి ప్రేమ సిద్ధాంతము. చివరిలో ప్రేమించు, ప్రేమించు అని మూడుమార్లు వాడుటవలన చెవులలో ఆ శబ్దము మారు మ్రోగుచు అప్పారావుగారి ప్రేమ మన మనస్సులను దోచుకుంటున్నది. చివరి నాల్గు పాదాలు చాలు వీరిని భావకవిత్వంలో ఉన్నత స్థానం మీద కూర్చుండ బెట్టుటకు. ఎంతో గొప్ప భావనను చిన్న చిన్న వాక్యాలలో చక్కగా వర్ణించాడు. 'అల్పాక్షరములలో ననల్పార్థ రచన చేయుటయే గదా!' ఉత్తమ కవిత్వ లక్షణము.

ప్రేమయే జీవితం కాబట్టి ప్రేమించాడు. తన ప్రేయసికి తనకు గల అన్యోన్యతను అతి సుకుమారంగా వర్ణించుకున్నాడు. ఈ ప్రేయసితో సంయోగమును వాంఛించి, ఇలా అంటాడు.

ఆ మబ్బు యీ మబ్బు
ఆకాశ మధ్యాన
అద్దుకున్నట్లు మన
మైక్య మౌదామె ?

ఇక్కడ వాడిన ఐక్యమౌదామన్న పదానికి ఎంతో గొప్ప అర్థమున్నది. ఒకసారి ఐక్యమైతే తిరిగి వేరనేది ఉండదు. ప్రకృతిలోని మబ్బు, తీగలు స్వేచ్ఛగా పెరిగి, తిరుగుచు కలిసిపోతాయి. వీటికి ఎవరి అదుపు ఉండదు. వీటినే ఉపమానములుగా స్వీకరించుట వలన కవి తన ప్రేమ కూడా అలానే ఉండాలని వాంఛించుచున్నాడని తెలియుచున్నది. ప్రకృతి ప్రణయములు సహజ ప్రవృత్తులేకాబట్టి పోలిక సమంజసముగా నుండి కవి భావనా చాతుర్యమును తెలుపుచున్నదీగేయము.

Words Worth ' Poetry is the spontaneous over flow of powerful feelings , అన్నమాటలు ఇక్కడ చక్కగా వర్తించును.

ఇలా సంయోగము వాంఛించిన కవికి వియోగము కల్గగా " కలలోనైనను చెలియ కలసి వలపు దీర్చలేవే?" అని ప్రాధేయపడి, ఫలితము లేకపోగా తన నిర్ణయమును యిలా ప్రకటిస్తాడు.

పోనీలే అంతదయ నీకు బుట్టకున్న
కర్మమని యెంచి గడిపెద కాలమెల్లో
ఎంచియో యెంచకో ప్రేమ నించినాను
బ్రతికినను చచ్చినను నాదు ప్రాణమీవె.

కృష్ణశాస్త్రిగారు ప్రకృతినిచూచి " ఆకులో ఆకునై అడవిలో దాగిపోతానని " పాడుకుంటే, బసవరాజుగారు ప్రకృతిలోని దృశ్యాలలో కూడ తన ప్రణయభావననే చూసుకొన్నాడు. " కోకిల " అను గేయంలో ఇలా అంటాడు.

ఈ మావిపై నుండి / ఈవు కూకూయంచు
నా మావిపై నుండి / ఆపె కూకూయంచు
.... .... ....
బాసలాడుచు నుంటిరే / కోకిలా
బాసలాడుచు నుంటిరే ?

కోకిలలు మాట్లాడుకొను మాటలు వట్టివికావు. ప్రణయ వాక్కులు. ఆ పలుకులు ప్రకృతి సహజములై అమృతములంత మధురమైనవి. అవి మాటలాడుకొను మాటలు బాసలలాగ వున్నవట ! " మనుజుల కగమ్యమైన " వనుట వలన అవి ప్రణయ జీవులకు మాత్రమే అర్థమగునని, సామాన్య మానవునికి అర్థం కావని తెలియుచున్నది. కోకిలలను ప్రణయ కవులని, ప్రేమ స్వరూపులని అనుట నూతన భావన. ప్రతి పద్యములోను చివర ఒకే పాదాన్ని రెండుమార్లు చెప్పుట వలన కవికి తాజెప్పు విషయముపై గల మక్కువ ద్యోతకమగుచున్నది.

ఆధునిక కాలంలో వచ్చిన సాహిత్యాలను పరిశీలించినచో నాటి భావ కవిత్వమునుండి నేటి విప్లవ సాహిత్యము వ్రాసిన కవుల వఱకు దాదాపు అందరి రచనలపై కూడ ప్రాచీన జానపదులు పాడుకొన్న పాటల శైలి, భాష, భావముల ప్రభావము అంతోయింతో కనబడుతుంది. " నేటి సాహిత్యం లో కనబడుతున్న ప్రతీకాత్మకత, ఆత్మాశ్రయత్వం, అస్తిత్వము మున్నగునవి ఆధునిక కాలంలో పాశ్చాత్యులలో ఒక ఉద్యమంగా ఏర్పడినంత మాత్రాన వీటి ప్రభావము చేతనే మన కవులు రచనలు చేయుచున్నారనటాని కంటె, వీరి రచనలు పరిశీలించాలను కున్నపుడు జానపద సాహిత్యంలో గల వివిధ దృక్పథాలను అధ్యయనము చేయటము ఎంతైనా అవసరము. " అన్న కృష్ణకుమారిగారి మాటలు ఎంతైనా గమనించ దగినవి. బసవరాజుగారి రచనలలో కూడా జానపదుల ప్రభావం ఎంతో కనబడుతుంది. వీరి " వెఱ్ఱిపిల్ల " యిలా పాడుతుంది.

గుత్తొంకాయ కూరోయ్ బావా
కోరి వండినానోయ్ బావా
కూర లోపల నా వలపంతా
కూరిపెట్టి నానోయ్ బావా!
కోరికతో తినవోయ్ బావా!

.... .... .... ....

వలపనే కూర, ప్రేమనే పాలు, కన్నె వలపనే వెన్న, పువ్వులలో పొదివిన యవ్వనం అను సమాసాలు ఈ గీతానికి ఎంతో నిండుదనాన్ని చేకూర్చినవి. నల్ల వాడే/ గొల్ల / పిల్ల వాడే " అను గేయంలోని శబ్దాలంకారము చక్కని లయను కల్గించి వినువారి డెందమును రంజింప జేయుచున్నది. ఈ రెండును కొద్దిమార్పుతో సినీ జగత్తులో చేరి విశేష ప్రచారము నొందినవి.

అప్పారావుగారు చక్కని భావుకుడే కాక గొప్ప ఆధ్యాత్మికుడు తాత్వికుడుకూడ. భావన ఊహ జనితమైతే, తాత్వికము హేతుజనితము. ఈ రెండు లక్షణములు వీరొక్కరే కల్గియుండుట వీరి విశిష్టతను తెలుపుచున్నది. భగవంతుని యిలా దీనంగా వేడుకొంటాడు.!

" అకటా ! నా జీవనదంబిదియేమి

.... .... .... ....

ఇంతేనా ? ఇంతేనా ? సౌఖ్యం
బీజన్మకు నిక నింతేనా
సుంతయైన దయ లేదా దేవా? "

అకటా! అనునది సంతాపార్థకము. అకటా అను పదమును మూడు మార్లును ఇంతేనా అనునది మూడు మారులు వాడుటవలన కవిపై మనకు ఎంతో జాలి కలుగుటయే గాక ఇది చదువువారి హృదయములు ద్రవించు చున్నవి. కవితా మర్మము తెలిసిన కవులు మాత్రమే యిలా వ్రాయగలరు. కొండలలో కోనలలో అగాధంగా ప్రవహించు నదముతో జీవనమును పోల్చుటచే, జీవితము సుఖదుఃఖాల మయం. ఇవి వాని వాని కర్మను బట్టి లభించుతవి. పరమాత్మని అనుగ్రహము కల్గినపుడే జీవనదము యొక్క ప్రవాహం ఆగిపోతుందని, ఆ భగవంతున్ని నమ్ముకోవటమే మనపని యని మనకు ఆధ్యాత్మిక భావనను కల్గింపచేయుచున్నాడు. ఈ భావముతోనే " మానవ సౌఖ్యమ్ములకెల్లన్ పరిమాణము గలదుగదా" అంటాడు వేరొక చోట. " సాహిత్య విమర్శకు ఔపనిషద తాత్విక దృక్పథములను సాధనములుగా ప్రదర్శించుట అప్పారావు వెలయించిన విమర్శలోని ప్రత్యేకత" అని సంపత్కుమారాచార్యగారు అన్న మాటలను బట్టి

మహాత్మా ! నిన్నిక్కడ
బందీని చేస్తున్నారు !

ఇక్కడ నైతిక విలువలకు శిలువ వేశారు
ఇక్కడ మానవతా విలువలకు సమాధి కట్టారు
అసత్యం సత్యం పీక నొక్కెయ్యడం
ఇక్కడ జరుగుతోంది
అధర్మం ధర్మాన్ని ' రేప్ ' చేయడం
ఇక్కడ జరుగుతోంది
అహింసా సిద్ధాంతం మతోన్మాదుల చేతుల్లో–
దారుణంగా హత్య చేయబడింది
హింస వెర్రితలలు వేసి వికృతంగా నాట్యం చేస్తోంది
స్వార్థం విలయతాండవం చేస్తోంది
రిజర్వేషన్లు కులాల్ని వేలెత్తి చూపుతున్నాయ్
మహాత్మా !
దేశం పరిస్థితి ఇది
నీవాశించిన పరిస్థితి ఇక్కడ లేదు
నీ మార్గం ఇక్కడ కన్పించడం లేదు
నీ విగ్రహాలైతే ఉన్నాయ్
కానీ ....
వాటికి ఆదరణే లేదు
రాజకీయ పార్టీలు పోటీపడ్తూ –
తమ జండా తాళ్ళతో నిన్ను బందీని చేస్తున్నాయ్ !

— ఐ. ఎల్. ఎన్. చంద్రశేఖర్

“ శ్రీవాణి ” జీవితసభ్యులు

## శ్రీ జె. యన్. నరశింహం

కు జు

వీరు కవిత్వంలోనే కాక సాహిత్య విమర్శలో కూడ చక్కని ఆధ్యాత్మిక తాత్విక దృక్పథం కల్గిఉన్నారని తెలియు చున్నది.

ఆనాడు వీరు గాంధీజీపై వ్రాసిన గేయాలు ప్రజలను ఎంతో ఉత్తేజ పఱచినవి. వీరు ‘‘మా గాంధి’’ గేయంలో మహాత్మున్ని యిలా వర్ణిస్తారు.

కొల్లాయి గట్టితే నేమీ / మా గాంధి
కోమటై పుట్టితే నేమీ

నాల్గు పరకల పిలక
నాట్య మాడే పిలక
నాలుగూ వేదాల
నాణ్య మెరిగిన పిలక.

మొదలి నాగభూషణ శర్మగారు “ ఈ గీతంలో మొదటి రెండు పంక్తులు గాంధీజీ లక్షణాన్ని ప్రదర్శిస్తూ చివరి రెండు పాదాలలోను ఆ లక్షణాన్ని మహత్తరమైన ఆధ్యాత్మిక భావానికి జోడించడం జరిగింది.’’ అన్న మాటలు ఎంతో సముచితముగా వున్నవి. గాంధీజీ ప్రారంభించిన ఉప్పు సత్యాగ్రహమును దృష్టిలో పెట్టుకొని “ స్వరాజ్య లక్ష్మి పెండ్లి” లో సంద్రమే పెండ్లియిల్లని, దేవతలే సదస్సులని, ఉప్పే తలంబ్రాలనిఅద్భుతంగా ఊహచేశాడు. వీరు గాంధీజీపై వ్రాసిన గీతాలను గురించి “ భావకవులు రచించిన జాతీయ గీతములలో కళామూల్యము కొఱవో కుండా గాంధీజీని కీర్తించిన వారిలో బసవరాజు అప్పారావు గారు ముఖ్యులు.’’ అని నారాయణరెడ్డి గారు పేర్కొనిరి.

తన సంతానము గిట్టినపుడు అప్పారావుగారు వ్రాసిన స్మృతి గేయాలు ఎంతో విలువైన సాహిత్యము. తన కుమారుడు పుట్టి పోయినపుడు -

వేదాద్రి శిఖరాన వెలిగున్న జ్యోతి
మినుకుమని కాసేపు కునికిపోయింది

కాపురమొచ్చిన కన్ని పాపాయి
ఇల్లు కాళీ చేసి వెళ్ళిపోయాడు !

అని కవి తీవ్రమైన దుఃఖోద్వేగముతో కుమిలిపోతాడు. ఇందలి చివరి పంక్తులను కృష్ణశాస్త్రిగారు “ ప్రపంచ కావ్య భాండాగారాల్లో గొప్ప పంక్తుల్లో ఇదొకటి ” అని మెచ్చుట, వీరి కవిత్వ గొప్పతనము తెలియుచున్నది. “ వాక్యం రసాత్మకం కావ్యం అని కదా ! ” ఆర్యోక్తి.

దైవభక్తిని ‘గోపికా గీతాలు’ మున్నగు గీతాలలో, సంస్కరణాభిలాషను “ నీటి బుగ్గలు ” మున్నగు గీతాలలో చక్కగా వ్యక్తము చేశాడు.

ఈ విధంగా ప్రణయాన్ని మొదలుకొని ప్రతిదానిని హృదయంతో అనుభవించి, అనుభవించిన దానిని భావించి సుందర సుకుమార పదాలతో మనకందించిన భావ కవితా తపస్వి బసవరాజుగారు. “ కావ్య లక్షణములన్నీ లేక పోయినా స్వయం సంపూర్ణమై పూర్వాపరాకాంక్షమై, పరి సమాప్తారకమైన రసపర్యవసాయి కాదగిన కావ్యైక దేశము ఖండ కావ్యము.” అన్న సంపత్‌గారి మాటలను బట్టి, వీరి “ బసవరాజు అప్పారావు గీతాలు ” అను రచనను చక్కని ఖండకావ్యాల సమాహారముగా భావింప వచ్చును.

# జ్యోతిషవాణి

నిర్వహణ : దైవజ్ఞరత్న వాస్తుజ్యోతిష విద్వాన్
**కవితా కామేశ్వర శర్మ**
అవనిగడ్డ - 521 121

వి. వి. రత్నం — కాళహస్తి
ప్రశ్న : జాతకాలలోని దోషాలను నివారించుకోవచ్చునా? నా జాతకంలోగల దోషం.
సమా : నివారించుకునే దోషాలు కొన్ని - నివారింప బడనివి కొన్ని. గంగాస్నానం చేస్తే పాపం పోతుంది. కాని శరీరంలోని వికలత్వం పోదు. అనగా భావాలలోని దోషం పోదనుట. దశాభుక్తులలోని దోషం కొంతవరకు తగ్గును.

ఎస్. ఆర్. రామ — తిరుపతి
ప్రశ్న : జాతకం బాగుంటె ప్రతిపక్షులు ఎంతటి బలం గలవారైనా అపకారం జరుగునా ? నా జాతకం చూచి చెప్పండి.
సమా : "అదృష్టవంతుని చెరిపేవారు లేరు. దురదృష్టవంతుని బాగుచేసేవారు లేరు" అని సామెత గదా. గీత లేనిదే గిల్లుకున్నా రాదని అందరకూ తెలసినదే.

ఎస్. వి. ఎల్. నారాయణరావు — గుంటూరు
ప్రశ్న : నా స్వభావం ఎట్టిది జాతకరీత్యా.
సమా : గోముఖవ్యాఘ్రంగా వుండవచ్చు. లగ్నాధిపతి 8 లో పాపయుక్తుడు. మాటలు మధురం. హృదయం.... యీ రోజులలో యీలాగు ఉంటేనే చెల్లుబడి, బ్రతుకు తెరువు.

వి. వి. నాగభ్రమరాంబ — ఖమ్మం
ప్రశ్న : ఉద్యోగమునకు అవకాశము కలదా ?
సమా : సామాన్యమగు సంపాదనగల ఉద్యోగంకి అవకాశం గలదు.
ప్రశ్న : వివాహ సమయము తెలుప ప్రార్థన ?
సమా : వయస్సు 22 సంవత్సరములు రావాలి బహుశా.

వి. వి. శివరామకృష్ణ — ఖమ్మం
సమా : మానసిక చికాకులకు కారణం గ్రహస్థితి బాగుండకపోవుటయే. 1986 చివరిలో ఉద్యోగం రాగల సూచనలున్నవి. నమ్మకముంటే నవగ్రహ ప్రదక్షిణములు చేయండి 3 మాసాలు.

ఆకాశపు సత్యనారాయణ — బందరు
ప్రశ్న : నాకు ఉద్యోగం వస్తుందా ? ఎప్పుడు? నా కుటుంబాన్ని నేను సుఖపెట్టగలనా ?
సమా : 1986 లేక 1987 లో ఉద్యోగం వస్తుంది. కుటుంబాన్ని సుఖపెట్టగలరు.

డి. గోపీనాథ్ — సత్యనారాయణపురం
ప్రశ్న : భవిష్యత్తు ఎట్లుంటుంది ? శని దశయోగించునా? వివాహము జరుగునా ? కుటుంబ సుఖము ఉండునా ?
సమా : శనిదశ మధ్యమంగా 70 శాతం యోగించును. యీ శనిదశా స్వభుక్తిలో 27-6-87 లోపల వివాహమగును. (ఇదివరలోనే వివాహం జరగవలెనే మరి - జరిగి విభేదాలు రాలేదుగదా ? ) కుటుంబసౌఖ్యం మధ్యమం. శనిదశా బుధ భుక్తినుంచి శనియోగం బాగుంటుంది. చరలగ్న లాభస్థితిగద.

---

**జ్యోతిషవాణి**

పేరు ...............................................
పూర్తి చిరునామా..........................................
..........................................
లేఖ వ్రాయు తేది.....................
టైము పగలు/రాత్రి.....................
జనన తేది ..........లేనిచో సుమారు వయస్సు

---

# సనాతన భారతీయ కార్మిక వ్యవస్థ

**భా**రతదేశంలో కార్మిక విధానం లోగడ లేదని కార్మిక వ్యవస్థకు అవసరమైన నియమ నిబంధనలన విదేశాలనుండి తెచ్చుకుంటున్నామని నేటి మన కార్మిక నాయకులు వాదిస్తుంటారు. ఇది ఏమాత్రం వాస్తవం కాదు. ఏనాడో మన పూర్వీకులు కార్మికునికి అవసరమైన సదుపాయాలు చేసారు. అనేక నియమ నిబంధనలను రూపొందించారు. ఇతర దేశములలో కార్మిక వ్యవస్థ ఏర్పడక మునుపే మనదేశంలో యజమానికి కార్మికునికి మధ్య నుండవలసిన సంబంధాలు నిర్దేశించబడినాయి.

కార్మికనీతి విషయంలో భారతీయ వారసత్వమెటువంటిదో తెలుసుకునేందుకు వేదాలు; గీత, అపస్తంభ, వశిష్ఠాదుల ధర్మశాస్త్రాలు; నారద, పరాశర, యాజ్ఞవల్క్య, విష్ణు, కాత్యాయన, బృహస్పతి, మన్వాదుల స్మృతులు; శుక్రాచార్యుని నీతిశాస్త్రము, చాణక్యుని అర్థశాస్త్రము పరిశీలించి ప్రశంశించదగ్గవి.

## కౌటిల్యుడు (చాణక్యుడు)

అధికారికి సేవకునికి గల వప్పందమును కార్మికులు ముందుగానే తెలుసుకోవాలి. ముందు బేరం ఆడకుండా పని చేయించుకొనే యజమానిని శిక్షించాలని యాజ్ఞవల్క్యుడంటే, ఆ యజమాని ఆదాయంలో పదవ వంతు కార్మికునికిచ్చివేయాలని నారదుడు పేర్కొన్నాడు. వేతనాలు ముందు నిర్ణయించబడకపోతే, ఆ పనినిబట్టి, రేటును బట్టి నిపుణుల నిర్ణయం ప్రకారం వేతనం ఇవ్వాలంటాడు కౌటిల్యుడు. అంతేకాదు సెలవు రోజున పని చేయించుకుంటే అదనపు జీతం యివ్వాలని, కార్మికునికి పని యివ్వకపోతే యజమానికి పన్నెండు అణాలు జరిమానా విధించాలని, సగం పని పూర్తి చేసిన తరువాత పని యివ్వడము మానివేస్తే కార్మికులకు పూర్తి జీతం యివ్వాలని, ఒప్పందము ప్రకారం నిర్ణీత సమయాలలో జీతము యిచ్చి తీరాలని, జీతాలు చెల్లించని యజమానులకు జరిమానాలను కూడా సూచించాడు కౌటిల్యుడు.

## స్త్రీ కార్మికులు

అవివాహితులు, వితంతువులకు నూలు, ఉన్ని, జనపనార వగైరా వడికే పనులను కల్పించాలని, గర్భిణీస్త్రీలను పని నుండి తొలిగించరాదని, వారికి ప్రసవ సౌకర్యాలు కల్పించాలని, ముసలివారు, పిల్లలు మున్నగు వారిచే పని చేయించరాదని కౌటిల్యుడు చెప్పాడు.

## సంక్షేమం ( WELFARE )

శుక్రనీతి ప్రకారం కార్మికుల వ్యక్తిగత జీవన సౌఖ్యాన్ని గురించి యజమాని ఆలోచించడం విధి, అవసరం, న్యాయం. వారి మానసిక శాంతి, జీవితావసరాలు, అభివృద్ధి, విద్య, ఆరోగ్యము మొదలగు విషయాలలో యజమాని శ్రద్ధ వహించాలని, అత్యవసరమైన అవసరమైతే తప్ప పండుగలనాడు పని చేయించరాదని, ఆనాడు జీతంపై సెలవు యివ్వాలని శుక్రనీతి చెబుతున్నది.

## అనారోగ్యము – శలవు

అనారోగ్యవంతుని యజమాని పనిలోనికి పిలువ కూడదని, కొద్దికాలమైతే జీతముమీద సెలవు (On full pay) యివ్వాలని, మరీ ఎక్కువకాలమైతే తగు జీతంమీద (Average Pay or Half Pay) సెలవుయివ్వాలని, ఆరోగ్యం చేకూరిన తరువాత పనిలో చేరి ఆ పనిని పూర్తిచేసి పూర్తి జీతం పొందవచ్చునని బృహస్పతి నీతి చెబుతున్నది. అనారోగ్యాది కారణాల వలన కార్మికులకు సెలవలు యిచ్చి తీరవలసినదేనని, అన్యకారణాలైతే కార్మికులు మరొక పనివారిని (Substitute) యజమానికి వప్పగించే బాధ్యత వున్నదని కౌటిల్యుని అభిప్రాయం.

## ఉద్యోగ విరమణ (RETIREMENT)

ఉద్యోగ విరమణానంతరం జీవనభృతి ( Pension ) యివ్వాలని, పనిలో ఉండగా కార్మికుడు మరణిస్తే వారి కుటుంబ బాధ్యత యజమాని మీద వుంటుందని, ఉద్యోగ విరమణ లేదా మరణము జరిగిన తరువాత కార్మికుని కుమారుడు అర్హుడైతే అతడికి పని కల్పించాలని శుక్రుడు, కౌటిల్యుల అభిప్రాయం.

## పారితోషికం (BONUS)

" అష్టమాంశం పారితోషికం
దద్యాత్ భృత్యాయవత్సరే
కార్యాష్ట మాంశం వాదద్యాత్
కార్యం ద్రాగధికం కృతమ్ "

అనగా ప్రతిఏడు ఉద్యోగికి అతని జీతంలో 8వ వంతు పారితోషికం (Bonus) యివ్వాలని, అతడు నైపుణ్యంతో పనిచేస్తే వచ్చినదానిలో 8వ వంతు పారితోషికం యివ్వాలని మన అనాది భారతీయ సాంప్రదాయం.

## FAMILY PENSION

" (యావజ్జీవంతు) తత్పుత్రే క్షమేబాలే తదర్థకం
భార్యాయాం వా సుశీలాయాం కన్యాయాం వాస్వశ్రేయసే"

అనగా కార్మికుడు మరణించి, అతడి పుత్రుడు మైనరుగా ఉంటే, పెద్దయ్యేవరకు అతడి పెన్షన్‌లో సగము అతడి భార్యకు, కుటుంబానికి భృతిగా యివ్వాలని పేర్కొన్నారు.

## PENSION

" చత్వారింత్సమానితాః, సేవయాయేన నైనృవః
తతః సేవాం వినాతస్మై, భృత్యర్థం కల్పయేత్
సదా యావజ్జీంవతు "

అనగా 40 సంవత్సరములు ఉద్యోగం చేసి విరమించిన వ్యక్తికి మిగిలిన జీవితకాలమంతా అతనికి జీతం పెన్షన్‌గా యివ్వాలి.

## ప్రజాస్వామ్యంలోనే ....

" ప్రతిభ " కు శిరోముండనం
కులం " మీసాల " కు
సంపంగినూనె మర్దనం !
" సువర్ణయుగం " ఖతమయ్యింది !
" వర్ణయుగం " షురూ అయ్యింది !

- కె. కిశోరుబాబు
- కె. అశోకుబాబు

## ప్రావిడెంట్ ఫండ్

" షష్ఠాంశం వా చతుర్థాంశం
భృత్యస్య పాలయేత్
దద్యాత్తదర్థం భృత్యాయ
ద్వి త్రి వర్షేఖిలంతుదా "

అనగా ఉద్యోగుల జీతంలో నాల్గవవంతో, ఆరవవంతో నిలుపుజేసి రెండు మూడేండ్ల కొకసారి ఆ మొత్తాన్నిగాని అందులో సగాన్నిగాని ఒక్కసారిగా యిస్తూండాలని మన నీతిశాస్త్రములు చెబుతున్నాయి.

ఎన్నో వేల సంవత్సరాల క్రిందటనే, ఇతర దేశాలలో నాగరికత అంటే ఏమిటో తెలియని సమయంలోనే భారత దేశంలో కార్మిక వ్యవస్థ ఏర్పడింది. కార్మికుల జీవన పరిస్థితులను గురించి ఆమూలాగ్రము చర్చించబడి అనేక సంక్షేమ పథకములు యిక్కడ తయారుచేయబడినాయి. నవనాగరికులమని విర్రవీగుతున్న నేటి ప్రపంచానికి సనాతన భారత కార్మిక వ్యవస్థను పరిశీలిస్తే ఎవరు నాగరికులో బోధపడుతుంది. మన సనాతన వ్యవస్థను పరిశీలించకుండా అనుకరణ వ్యామోహంలో మనం పరుగులు తీస్తున్నాం. ఇదే ఈనాటి మన దురవస్థ.

— శ్రామిక్

# పుస్తకసమీక్ష

## "తెలుగు నాటకం"

డా॥ ఎస్. గంగప్ప, ఎం. ఏ., పిహెచ్. డి.,
వెల : రు. 15-00
ప్రాప్తిస్థానం : శ్రీమతి ఎస్. పార్వతమ్మ,
సి/73 శ్రీనివాసనగర్ కాలనీ, గుంటూరు

డా॥ గంగప్పగారు నాగార్జున యూనివర్శిటీ తెలుగు శాఖలో రీడర్ పదవిలోనే గాక, ఇంకా ఉన్నత స్థానంలో ఉంచదగిన ప్రజ్ఞాశాలి, పండితుడు, పరమభావుకుడు. గంభీరమైన హ్రదం వంటి వీరి పాండిత్యం, విమర్శనాశక్తి సమకాలికులలో అరుదు అని చెప్పవచ్చు. విశ్వనాథవారి "వేయి పడగలు" పై విశ్లేషనాత్మక విమర్శ చేసి విశ్వనాథ సాహిత్యం పీఠం వారి అవార్డు పొందిన వీరి ప్రతిభే ప్రతిభ. "రాజ రాజ ప్రశస్తి" అనే వీరి చారిత్రక గ్రంథం ఇదే ఇతివృత్తంలో వెలువడిన అనేక రచనలలో మేలుగా ఉన్నదని నా అభిప్రాయం.

ప్రస్తుత గ్రంథం పేరు "తెలుగు నాటకం". నాటకమంటే యేమిటి ? దశ విధ రూపకాలలో ఉంటే నాటకమని అర్థమా ? తెలుగులో నాటకాలన్నీ సంస్కృత నాటక లక్షణ లక్షితాలవుతాయా ? తెలుగులో నాటకాలనబడ్డవన్నీ నిజంగా నాటకాలేనా ? 19 నాటక సాహిత్య వ్యాసాల సంపుటియే "తెలుగు నాటక" మనే పుస్తకం. 1965 నుండి గంగప్పగారు వివిధ పత్రికలలో ప్రకటించిన వ్యాసాల కూర్పు. గ్రాంధికంలో కంటే వ్యావహారికంలో రచన చేయుటయే కష్టం. గంగప్పగారి భాష సుబోధకమే.

"కోలాచలం శ్రీనివాసరావు - నాటక సాహిత్య సమాలోచన" మనే గ్రంథం గంగప్పగారికి Ph. D. తెచ్చిపెట్టింది. ఏ తద్గ్రంథ రచనాసందర్భంలో వారు రూపక మర్యాదలను ఆపోశన పట్టారు.

తెలుగులో 19 వ శతాబ్దిదాకా నాటకాలెందుకు రాలేదు? స్వతంత్ర నాటకాలు కాకపోయినా అనువాదాలైనా ఎందుకు రాలేదు ? పినవీరన శకుంతలాన్ని పద్యకావ్యంగా ఎందుకు వ్రాశాడు ? శ్రీనాధుడు "క్రీడాభి రామా" న్ని "వీధి" నాటకంగా వ్రాశాడేమిటి ? సంస్కృత నాటకాలను వీళ్ళు అనువదించ లేదేమి ? ఇవన్నీ ప్రశ్నలు : గంగప్పగారి గ్రంథం చదవండి తెలుస్తాయి. కోరాడ రామచంద్ర శాస్త్రిగారిని ప్రథమాంధ్ర నాటక కర్త అని గంగప్పగారు చెప్పటం న్యాయంగా ఉన్నది. (1860, మంజరీ మధుకరీయం) (కొందరు కాదంటారులెండి, కం॥ వీ॥ పంతులు గారికో, ఇంకొకరికో పట్టం కడతారు) కందుకూరి వారు సంస్కృత నాటకాలు కొన్ని అనువదించినా వారిపై ఇంగ్లీషు సంస్కృతి ప్రభావం ఉన్నది. ధర్మవరం కృష్ణమాచార్యుల వారి నటన, వారి చిత్రనశీయం తెలుగుదేశాన్ని ఉఱ్ఱూత లూపినాయి. కోలాచలం శ్రీనివాసరావుగారు చారిత్రక నాటకాలలో చక్రవర్తి స్థానీయుడే. మళ్ళీ గురజాడ దగ్గరకు వస్తే "కన్యాశుల్కం" స్థాయి యేమిటన్నది ప్రశ్న. వేదంవారి ప్రతాపరుద్రీయమున్నది. తిరుపతి వెంకటకవుల పాండవోద్యోగ నాటకాలున్నాయి. వీటి స్థానం వీటికున్నది.

"మృచ్ఛకటిక మూలం - చారుదత్తము," "విక్రమోర్వశీయం - విదూషకుడు" అనే రెండు వ్యాసాలు గ్రంథకర్త ఆయా కవుల లోతుల లోనికి వెళ్ళి తెలిసి కొన్నట్లున్నాయి. తెలుగు నాటకమనే యీ గ్రంథాన్ని యింగ్లీషులోనికి అనువదించితే మన నాటక సాహిత్య ప్రతిష్ఠ పదిమందికీ బాగా తెలుస్తుంది. ఈ అనువాదాన్ని గంగప్పగారే చేయవచ్చు. వారి "Preface" లోని ఇంగ్లీషు రచనా విధానం వారికి ఇంగ్లీషుపై గల అధికారాన్ని సూచిస్తోంది.

— కాజ లక్ష్మీనరసింహారావు

# రంజనిమాల

సంకలనం

డా॥ వి. ఫణీంద్రుడు

ఈ దిగువ పేర్కొన్న ఆధారములతో నదుల / ఊర్ల పేర్లతో రంజనిమాలని పూరించండి.

అడ్డము :

నది ప్రవాహమును అరికట్టుటకు నిర్మించబడ్డ ప్రోజెక్ట్ (7)

4. అహోబల పండితుడు పొందిన అగ్రహారం (6)

5. ఆకుపచ్చ చలువరాయి పెద్దపెద్ద చెక్కలుగా వీలయిన స్థలం (5)

6. శ్రీకాకుళం వద్ద సముద్రంలో కలియునది (4)

8. వంశధార నది పుట్టినచోట (4)

10. యానామువద్ద సముద్రంలో కలియుచున్న నదిపాయ (7)

13. ఈ కొండలని సీమకుర్తి కొండలని పిలుస్తారు (4)

15. వేమన సమాధి ఉన్న స్థలము (5)

16. ఇక్కడ లభ్యమయిన చలువరాతి ఫలకమందు మాంధాత జాతకము చిత్రింపబడియున్నది (5)

18. కాకతీయుల రాజధాని (4)

20. పురాతనమయిన రేవు పట్టణము (6)

24. నర్సరావుపేట తాలూకాలోని ఈ గ్రామమందు 746వ శిలాశాసనముంది (5)

25. బంగారు గని (3)

26. అనంతపురం జిల్లాలోని పెద్ద పట్టణము (4)

27. నర్ణాసాగర్ ప్రోజెక్ట్ ఈ వాగుపై నిర్మించబడినది (4)

28. జైన్ దేవాలయమున్న (ఆంధ్రదేశంలో) స్థలం (3)

నిలువు :

1. తంజావూరు రాజు చెంగమలదాసు రహస్యంగా పెరిగిన స్థలము (6)

2. బుద్ధుడు మొట్టమొదటిసారిగా బోధించిన స్థలము (4)

3. తెలంగాణాలో సాహిత్యపోషణకి ప్రసిద్ధమయిన సంస్థానము (4)



4. నెల్లూరు జిల్లాలోని ఇచ్చట కోట శిధిలములున్నవి (5)

7. అంతర్వేదివద్ద సముద్రంలో కలియు నది పాయ (7)

9. ఆంధ్రలో సాహిత్యపోషణలో ప్రసిద్ధమయిన సంస్థానము (4)

11. ఈ యుద్ధానంతరము ఒక సామ్రాజ్యము పతనమయినది (4)

12. పూర్వము వజ్రములుండెడి ప్రాంతము (5)

13. బొమ్మలకి ప్రసిద్ధి (4)

14. జిల్లాగా మారిన తాలూకా (7)

19. పూర్వం రాయచూరు జిల్లాలో నుండెడి సంస్థానం ప్రస్తుతం మహబూబ్‌నగర్ జిల్లాలో వుంది (3)

21. 14 నుండి ఇక్కడికి రైల్లో బొబ్బిలి మీదుగా పోవాలి (3)

22. "చంద్రోదయము" రచించిన చెన్నమరాజు ఈ కోటకి చెందినవాడు (4)

23. ఇక్కడ శాశ్వతమయిన ఊటలున్నాయి (5)